# విమర్శ వ్యాసములు

రచయిత

ప్రస్తుతము చెన్నపురి విశ్వకళాపరిషత్తునాంధ్రపరిశోధక విద్యార్థియు,
పూర్వము చెన్నపురి మహిళాక్రైస్తవ కళాశాలయందును
బందరు నోబుల్ కళాశాలయందు నాంధ్రాధ్యాపకుఁడునగు

శిష్టా రామకృష్ణశాస్త్రి, ఎం. ఎ.,

శిష్టావారి గృహము
బచ్చుపేట :: బందరు.

# పత్రికాభిప్రాయములు.

భా ర తి మార్చి 1941

ప్రాచీప్రతీచీ వాఙ్మయతత్త్వముల నెఱిగినవిద్వాంసులగుడు, ప్రస్తుత గ్రంథకర్తగారు ఆంధ్రచరిత్రకును, ఆంధ్రవాఙ్మయచరిత్రకును గల అవార్యసంబంధమును సహేతుకముగజూపి, బ్రాహ్మణబౌద్ధమతముల సంపర్కమువలనను, బ్రాహ్మణజైనమతముల సంఘర్షణము వలనను ఆంధ్రవాఙ్మయవసుంధరలో పొడసూపిన బాగోగులను వివరించిరి. * * * నన్నయ,తిక్కనల రచనారీతుల వ్యత్యాసములను దెలుపుచు, వీనిని దృష్టాంతీకరించు భారతభాగములను పేరొకనిరి. "నన్నయ రచన కరడుగట్టిన దధివలె స్నిగ్ధమైయుండ, దిక్కనరచన క్షీరము వలె జాలువారుచుండు" నని వీరు వచించిన వాక్కు భావబంధుర మైనది. * * * పోతన రసోపాసకు డనరి. తిక్కన పోతనల కవిత్వ ప్రభావమందలి వ్యత్యాసములను చక్కగ తెలిపిరి. రచయితల చరిత్రవిభేదముల ననుసరించియే ఆంధ్రభారత, భాగవతములందలి పాత్రముల చరిత్రలందలి వ్యత్యాసములు పొడసూపినవిషయము నుల్లేఖించిరి,

ఈ యంశములను పరిశీలించినపాఠకులు గ్రంథప్రశస్తిని చక్కగ గమనింపగలరు. ఈ గ్రంథమును పఠించినపిదప నన్నయ తిక్కన పోతనల రచనలను మఱియొకమాఱు పరిశీలించు పఠితలు వారి కవిత్వమందలి మహత్త్వ పటుత్వములను చక్కగా హృదయంగమము గావించుకొనగలరు. గ్రంథము అమూల్య విషయములతో నిండియున్నది. ఆంధ్ర వాఙ్మయమును సవిమర్శముగ పరిశీలింప దలచువారి కిది సహకారి కాగలదు.

కృష్ణాపత్రిక. 1-3-1941.

వాఙ్మయమును సమీక్షచేయడంలో, ఆ యా కవుల యొక్క జీవితములూ అప్పటి కాలమానపరిస్థితులూ పరిశోధించి, అవి వాఙ్మయానికి ఏవిధమైన దోహదం కల్పించాయో, పరిశీలించి విమర్శచేయడం పాశ్చాత్యసంప్రదాయం. అన్వయముఖమైన కేవలరసదృష్టిమాత్రమేకాక, ఈ విధమైన పరిశీలనకూడా వాఙ్మయముయొక్క సంపూర్ణ స్వరూపాన్ని గోచరింపజేసుకోడానికి చాల ఉపకరిస్తుం దనడానికి సందేహంలేదు. వాఙ్మయముయొక్క తత్వాన్ని ఈ విధమైన దృష్టితో నిరూపించి, నన్నయ యుగాన్ని ఇందుకు ఉదాహరణగా విమర్శించి చూపారు శాస్త్రిగారు ఈ రెండు వ్యాసాలలో.

చక్కని హేతువాద పురస్సరమైన రచన. ప్రచారంలో వున్న అపోహలను తొలగించి, నేటి పరిశోధనాఫలితాలను క్రోడకరిస్తూ, నన్నయనాటి వాఙ్మయస్వరూపాన్ని యథాతథంగా ప్రతిబింబిస్తున్నది 'నన్నయయుగం' అనేవ్యాసం.

HINDU 13-7-41.

*In it the author takes advantage of the latest discoveries in South Indian History * * He pays a high compliment to Nannaya as the writer of the first Telugu epic, though, very rightly, he gives him a secondary place as a literary artist, giving the first place to Tikkana, whom he puts on a par with Shakespeare and Kalidasa.* * *

*In "Potana" he makes a just estimate of the poet as the Bhavabhuti of Telugu—the Rasopasaka whose transgressions are easily forgotten in the mellifluous sweetness of his verse.*

శ్రీ

# కృతి సమర్పణము

నవమాసమ్ములు మోయుకష్టములఁబొందంజాలియు నోర్మిమునన్
లవమైనం గనుపింపనీయక మహాహ్లాదంబునుం బొంది గా
రవమున్నెయ్యము మీరనన్నుఁ గృపతోరక్షించి తాఁబుత్రసం
భవమోదంబును బొందుమాత నెదలో మన్నించిపూజించెదన్

శిష్టుల వంశమై తనరు చెర్వ్వకులంబునఁ బుట్టి పూతమా
శిష్టసమాఖ్య వంశమును జేరి కులంబును విస్తరించి సం
తుష్టివహింపఁ బండితమనోహరి పండితమాతయున్ మహా
దృష్టతఁ బాడితస్నుష పతివ్రతయైన పురంధ్రిఁ గొల్చెదన్

పుట్టినదాది మృత్యుముఖముం బడఁబోయెడువానిఁ బ్రోవఁగా
చెట్టుకుఁబుట్టకుం జనులు చెప్పినవానికి నెల్లమ్రొక్కి యి
క్కట్టుల నెన్నొసైచి నను గాంచినమాత ఋణంబుఁ దీర్పఁగా
నెట్టన భక్తి నంకితము నిచ్చెద వేంకటసుబ్బమాంబకున్.

---

# పీఠిక

ఇందలి వ్యాసములలోఁగొన్ని కృష్ణాపత్రికాదు లందప్పు డప్పుడు ప్రచురింపఁబడినవి. అక్కడక్కడ చెదరియున్నవానిని సేకరించి గ్రంథరూపమునఁ జేర్చితిని. అందు 'నన్నయ యుగము' నఁ గొంతమార్పుఁ జేసినాఁడను. 'వాఙ్మయ తత్త్వము' న నిర్దేశించిన సారస్వత లక్షణముల నన్నియు 'నన్నయయుగము' నను 'పోతన' యందును సాధ్యమైనంతవఱకు సమన్వయించి నాఁడననియే విశ్వసించుచున్నాను. నాకుఁదోచిన సారస్వతా భిప్రాయముల వెలువరించుటే నాయభిలాష. అభిప్రాయ భేదములుండ వచ్చును. 'లోకో భిన్నరుచిః'.

నాకు సారస్వత గ్రంథపరిశీలనకు విశేషావకాశముఁ గల్గించి ప్రోత్సహించిన మ. రా. శ్రీ. శీలము గోవింద రాజులు నాయుఁడు బి. ఎ., బి, యల్., యల్. యల్. బి., బార్-ఎట్-లా., గారికిని, నాకుఁగలిగిన సందేహములను దయతో నివర్తించిన బ్రహ్మశ్రీ. కోరాడ రామకృష్ణయ్య ఎం. ఎ., గారికిని, బ్రహ్మశ్రీ. శ్రీపాదలక్ష్మీనపతి శాస్త్రిగారికిని నాకృతజ్ఞతా పూర్వక వందనముల నర్పించుచున్నాను. ఈ పొత్తమును బహుస్వల్పకాలములో నందముగ ముద్రించి నాకందఁజేసిన శ్రీవత్సముద్రణాలయమువారికి నాకృతజ్ఞత. ఎన్ని మాఱులు ప్రూఫుల జాగ్రత్తతోఁ జూచినను ముద్రణ ప్రమాదములు దప్పవు కాన నట్టి వానిని పాఠకులు దిద్దికొన వేఁడికోలు.

చెన్నపురి,
8-12-1940.

శిష్టా రామకృష్ణశాస్త్రి

# తప్పొప్పుల పట్టిక

| తప్పు. | ఒప్పు. | పుట. | పంక్తి. |
|---|---|---|---|
| వ్యుత్పత్యోః | వ్యుత్పత్త్యోః | 4 | 20 |
| సాంప్రదాయములు | సంప్రదాయములు | 7 | 15 |
| తేజోశక్తులు | తేజశ్శక్తులు | 8 | 6,7 |
| లఁగూర్చును | లుగలుగును | 13 | 13 |
| మందలి | మందు | 16 | 7 |
| యందలి | యందు | 17 | 11 |
| అర్థము | అర్ధము | 20 | 15 |
| నాస్థికుల | నాస్తికుల | 29 | 18 |
| ఉత్తరాభద్రా | ఉత్తరభద్రా | 33 | 4 |
| నుపయోగఁబడు | నుపయోగపడు | 41 | 6 |
| ఛందోచంపూ | ఛందశ్చంపూ | 43 | 11 |
| మూలానుసరణముగాను | మూలముననుసరించియు | 45 | 10 |
| బండ్ల | బదుల | 48 | 19 |
| ద్రోపించియు | ద్రోయించియు | 51 | 13 |
| తలిఁగెదరని | తలఁగెదరని | ,, | 20 |
| ,, | ,, | 61 | 5 |
| లందుఁగంటె | లకంటె | 71 | 1 |
| కర్ణాటయకఱ | కర్ణాటాకఱ | 73 | 12 |
| పోవుటయు | పోవుటవలనను | 75 | 4 |
| చెందినది | కలిగినది | 82 | 20 |

# విమర్శ వ్యాసములు

## వాఙ్మయతత్త్వము

ఆంధ్రభాషయందు వాఙ్మయ శబ్దము సారస్వతార్థమున రూఢమైనందున నా రెండును పర్యాయపదములుగ వాడఁబడు చున్నవి. కొందఱు వాఙ్మయచరిత్రమను నర్థమున భాషా చరిత్రమని వాడుచున్నారు. కాని యీ రెండు శబ్దములఁ బర్యాయపదములుగ వాడుట దోషము. ఒక భాషయందలి వ్యాకరణ విషయములు, నుచ్చారణపద్ధతులు మొదలైన వాని మార్పుల క్రమముఁగూర్చి చెప్పునది భాషాచరిత్రము. ఇఁక వాఙ్మయచరిత్ర మొక భాషయందలి నాటకములు, నవ లలు, ప్రబంధములు మొదలైన వివిధకావ్యముల క్రమాభి వృద్ధిఁగూర్చి చెప్పును. అయితే వాఙ్మయమన నేమి? ఈ విషయముఁగూర్చి పలువురకు భిన్నాభిప్రాయములు గలవు. దృశ్యమాన సమస్తగ్రంథజాలము వాఙ్మయమని కొందఱి మత మగుటచే వార్తా పత్రికలు, శాస్త్రములు, నిఘంటువులు వైద్యగ్రంథములు, పంచాంగములు, శాసనములు మొదలైనవి కూడ వాఙ్మయమునఁ జేరవలసియుండును. ఈ వాద మతి వ్యాప్తిదోషము పాలగుటచే సమంజసముగ లేదు. రసవంత ముగా వ్రాయఁబడిన చరిత్ర గ్రంథములఁగూడ వాఙ్మయమున

జేర్పరాదను మఱికొందఱ వాదమును యథార్థముగాదు. ఇందవ్యాప్తిదోషమున్నది. కాన వాఙ్మయమునఁ జేర్పఁదగిన గ్రంథములకే లక్షణములుండవలయునో గుర్తెఱింగిన వాఙ్మయ మననేమో తెలియఁగలదు.

వాఙ్మయమందలి గ్రంథములు శాశ్వతమైనవి కాన పంచాంగములు, వార్తాపత్రికలు తాత్కాలికములగుటచే సారస్వతమునఁజేరవు. అట్లైన శాశ్వతమైన సత్యముందెలిపి, యభిరుచిఁగలుగఁజేసి యుపయోగపడు శాస్త్ర గ్రంథములు వాఙ్మయముగాఁదగునా ? కాదు. శాస్త్ర గ్రంథములందలి విషయములు శాశ్వతమైనను గ్రంథములుమాత్రము శాశ్వత ముగానుండఁదగినవి కావు. ఆ గ్రంథములందలి విషయములు మనకొకమాఱు బోధపడినతరువాత నా గ్రంథములఁదిరిగి చదువఁ బ్రయత్నింపము. ఛందశ్శాస్త్రమైన యప్పకవీయ మందలి విషయమంతయు నా మూలాగ్రముగా బోధపడిన తరువాత నా గ్రంథమును దిరిగి చదువుదుమా ? అందలి విష యములను మనము స్వవాక్యములతోఁ జెప్పుకొనినఁజాలును గాన నా గ్రంథములఁ దిరిగి చదువము. మఱియు నా గ్రంథ మందలి విషయమునే మనము సొంతశైలిలో వ్రాసి మఱియొక ఛందశ్శాస్త్ర గ్రంథముఁజేయవచ్చును గాన నా గ్రంథమందలి విషయము శాశ్వతమైనను నా గ్రంథముమాత్రము శాశ్వతము గాఁజాలదు. తిక్కన భారతము, కాళిదాసు శాకుంతలము, షేక్స్పియరు నాటకములు మొదలైన కావ్యములలోని కథల మనము పూర్తిగ నెఱింగినను, కాళిదాసాదుల వాక్యములనే

యెన్నిమార్లైనఁ జదువుట కువిళ్లూరుదుము. అందుచే నా గ్రంథములు శాశ్వతములై వాఙ్మయమునఁ జేరినవి.

వాఙ్మయమునఁ జేర్పఁదగిన గ్రంథములు విశ్వజనీన ములై, యనగా సమస్త మానవాదరపాత్రములై, రచనా రూపమాలంకారికముగ నుండి రసానందజనకములుగా నుండును. న్యాయ వాస్తు జ్యోతిషాది శాస్త్ర గ్రంథముల నాయా శాస్త్రముల నెఱిఁగినవారుదప్ప సామాన్య జనులు సదివి యానందింపలేరు గాన నవి సమస్తమానవాదరపాత్ర ములై వాఙ్మయమునఁజేరవు. ఇఁక నాలంకారికముగ వ్రాయ బడిన దేశ చరిత్రములు తదితర దేశీయులకాదరపాత్రము గాదని వాదించినను నా గ్రంథములాలంకారికముగా రచింపఁ బడుటచేతను, రసానందము గలుగఁజేయుటవలన నవి వాఙ్మయ మునఁ జేరఁదగినవి. మఱియు గ్రంథములు కవియాత్మీయత (Personality) గలవనియు, కవియాత్మీయత లేనివనియు ద్వివిధములు. ఏ కావ్యమున కవి తన యాత్మీయతఁ దన సృష్టి వలనఁ జూపగల్గునో యది కావ్యమనిపించుకొని వాఙ్మయ మునఁ జేరును. విషయప్రాధాన్యమువలన నే గ్రంథమున గ్రంథకర్త దన యాత్మీయతఁజూపలేడో యది కావ్యమేకాదు. ఇట్టివి జ్యోతిషము, వైద్యము మొదలైన శాస్త్ర గ్రంథములు గాన నవి వాఙ్మయమునఁ జేరవు. వాఙ్మయమందు గ్రంథ కర్త యాత్మీయత వ్యక్తముగాగ, శాస్త్ర గ్రంథములందది శూన్యమైయుండు. వాఙ్మయము రసావేశమును సానుభూతిఁ గలుగఁజేయు, శాస్త్రము విజ్ఞానముఁగలుగఁజేయును. విజ్ఞాన

ము స్థిరమైనది కాఁగ, నావేశము క్షణికమును చంచల స్వభావము గలదై క్రమముగా మాఱుచుండును. యథార్థమునకీ రసావేశముఁగలుగఁజేయు శక్తిగల కావ్యములే వాఙ్మయమునఁ జేరును. ఈ విశిష్టలక్షణముఁబట్టియే గ్రంథప్రాశస్త్య ముండును.

వాఙ్మయమున ముఖ్యభాగములగు నాటకము, కవిత్వము లలితకళలందు గౌరవస్థాన మాక్రమించుటచే నరిస్టాటిలు మతము ప్రకారము వానియందు లలితకళలకుండు విశ్వజనీనమైన మానవజీవితానుకరణము, నానందదాయకత్వము మొదలగు లక్షణములుండి కళాస్ఫూర్తితో నొప్పుచుండును. ఇఁక సంస్కృతాలంకారికులలోఁ బ్రాచీనుఁడగు మమ్మటుఁడు వాఙ్మయమందుఁ జేర్పఁదగిన కావ్యలక్షణమును దన కావ్యప్రకాశికలో "అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్య" మ్మని నిర్దేశించెను. కావ్య లక్షణములఁగూర్చి బహువిచారణ సేసినవారిలో విశ్వనాథుఁడు "వాక్యం రసాత్మకం కావ్య" మ్మనియు, జగన్నాథ పండితుఁడు "రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్య" మ్మనియుఁ దెలిపిరి. మఱియు నానందవర్ధనుఁడు "కావ్యస్యాత్మా ధ్వనిః" యని స్థాపించి, ధ్వని గల కావ్యముత్తమమైనది యని చెప్పెను. ఇట్టి వాఙ్మయమును సృష్టించు కవికిఁ బ్రతిభావ్యుత్పత్తులుండును. "ప్రతిభావ్యుత్పత్త్యోః ప్రతిభా గరీయసీ". ప్రతిభయనగా "నవనవోన్మేషశాలిత్వ" మని తెలిపిరి. కనుక వాఙ్మయమున ప్రతిభాస్ఫురణముండును.

( శాశ్వతత్త్వము, విశ్వజనీనత, కళాస్ఫూర్తి, ధ్వని, ప్రతిభాస్ఫురణము మొదలైన లక్షణములు గల కావ్యము గ్రంథస్థమైనను కాకపోయినను వాఙ్మయమగును.) వేదములందీ లక్షణములు ద్యోతకమగుచున్నవి కాన నవి పూర్వము గ్రంథస్థము గాక బ్రాహ్మణులకంఠస్థముగ మాత్రముండి పరంపరాగతమగుచుండినప్పుడు వాఙ్మయము గాకపోయి, పిమ్మట నవి గ్రంథస్థమైనంతమాత్రమున వాఙ్మయ గౌరవముఁ బొందలేదు. అవి సర్వకాల సర్వావస్థలందు వాఙ్మయముగఁ బరిగణింపఁబడినవి. లిపి లేకపోయినపుడుత్కృష్ట వాఙ్మయమైనను గ్రంథస్థముగాఁజాలదు. ప్రతిభాషయందు వాఙ్మయము ముందుపుట్టి లిపి బయలుదేరినపిమ్మట నది గ్రంథస్థమగును. ప్రతివాఙ్మయమందు పాటలు మొదట నుద్భవించి జనుల ముఖస్థమై పరంపరగ వచ్చుచుండును. తెలుఁగున కుచ్చెల కథ మొదలైనవిట్టివే. ఇందు పైని చెప్పిన వాఙ్మయలక్షణములుండును గాన వాఙ్మయమనిపించుకొనును. పై నిర్దేశించిన వాఙ్మయలక్షణములుమాత్రము లేక గ్రంథస్థవిషయములెన్నియున్నను నవి వాఙ్మయమునఁ జేరవు.

వాఙ్మయము హృదయముఁజలింపఁజేయు లోకప్రవృత్తి యనెడు మానవకృత్యములతో సంబంధించియుండుటచే మనము దానిఁ జదువుటవలన లోకప్రవృత్తితో నూతనమైన సన్నిహిత సంబంధముఁబొందుదుము. మానవులు లోకమందు జూచిన విషయములను, బొందిన యనుభవములను భావములను మనకందఱకు శాశ్వతానందముఁగూర్చునట్లు భాషారూప

మున వ్యక్తీకరించినదే వాఙ్మయమనఁబడును. ఆ వ్యక్తీకరణము వివిధ సారస్వతరూపములఁ బొందును. వానిని క్రమముగా నధ్యాపకుఁడు దేశకాలముల ననుసరించి గమనించును. ఇట్లనుటచే వాఙ్మయము వ్యాకరణాలంకార శాస్త్రములకంటె భిన్నమైనదని భావము. వాఙ్మయము లోకప్రవృత్తినుండి జనించుటవలన దాని యుద్భవ కారణములుగూడ లోకప్రవృత్తియందే యరయనగును. మన భావములను లోకమునకుఁదెలుపవలయునను కోరికయు, మానవచర్యలందలి ప్రీతియు, వాస్తవప్రపంచమందును భావనా ప్రపంచమందును మనకుఁగల యభిరుచియు, వాఙ్నిర్మాణమునందు గల యభిలాషయు వాఙ్మయోదయమునకు మూలములగుచున్నవి. మన యోజనలను, భావములను మనమితరులకుఁ జెప్పవలయునని కుతూహలపడుదుము. అట్లే కవి సక్రమముఁగా వ్యక్తీకరించిన తన యోజనలును భావములును వాఙ్మయమగుచున్నది. మనము స్త్రీ పురుషుల జీవితములందును, వారి భావోద్రేకములందత్యంత ప్రీతిఁగలిగియుందుము, కాన వాఙ్మయము మానవ జీవిత చర్యల మహా నాటకముతో సంబంధించినది. చూచిన వస్తువుల, నూహించిన విషయముల నితరులకుఁ జెప్పుటకుఁగవి మనవలననే కుతూహలపడును. అదే వర్ణనా వాఙ్మయమునకు మూలము. రసవంతములైన విషయములు ప్రకృతియందు ప్రదర్శింపఁబడినపుడు రమణీయ స్వరూపము నిచ్చుచు వాని యాకారమును వ్యక్తీకరించుటయందు గల కౌతూహలమే సారస్వత కళోత్పత్తికి కారణము. ఈ పరిస్థితులన్నియు

లోకప్రవృత్తియందు కలిసియున్నట్లే వాఙ్మయమందును గలియు చుండును. మనసుమాత్రము పరిస్థితులను, స్వరూపములను బట్టి భావగీతము, పురాణము, నాటకము, వ్యాసము మొదలగు భాగములుగ విభజింతుము.

వాఙ్మయ ముఖ్యకర్తవ్యము మానవజీవిత ప్రతిపాదనముగాన, ప్రతిభావంతుఁడైన కవి మానవజీవితమును బాగుగ పరిశీలించి, యాజనుల స్థితిగతులను, భావములను, మనోవృత్తులను, నాశయములను, బాగుగ కనిపెట్టి చక్కని సందర్భములనుగల్పించి చెప్పును. ప్రతిమనుజుని భావము లాకాల నిర్ణీతములై యుండి, వాని జీవిత మాజాతీయ జీవనము నాశ్రయించును. ఒక జాతియందలి ప్రతివ్యక్తిభావము లాజాతీయ జీవితమును వ్యక్తీకరించుచు నాజాతికిఁ బ్రతినిధిగా నుండును. సాధారణముగాఁగవులు దేశ కాలపరిస్థితులకు వశ్యులై సాంఘిక వ్యవస్థలను, జాతిమత వికారములను వెలువరించుచుందురుగాన నావాఙ్మయమందా జాతిసాంప్రదాయములు, స్థితిగతులు సూచింపఁబడును. ఎంతటి మహాకవులైననీ స్వభావమును దాటి పోలేరు. కాన నొక దేశమున నొకానొక కాలమందలి వాఙ్మయ మచటిజనుల మనోవీథుల నెడతెగకుండ పాఱుచుండెడి భావప్రవాహమును, వారి జీవితచరిత్రమును దనలోఁ గేంద్రీకృతము చేసి, యాజాతిలక్షణములు శాశ్వతంబగునట్లా దేశమున నెలకొల్పును. ఒకానొక కవి జాతీయమార్గమునుండి భిన్నుఁడుగఁ గనిపించినను నతనిప్రతిభ యాజాతీయలక్షణములఁ బాల్పడని యేయుండును. వివిధ కవిప్రతినిధులందా యాజాతీయ

జీవనలక్షణములు వ్యాపించియుండును. సారస్వతము మూల మునసే యాజాతి జనుల బలమును, వైజ్ఞానిక నైతిక శక్తిసా మర్థ్యముల సాక్షాత్తుగఁగనుకొందుము. వాఙ్మయపఠనమట్లే యన్యజాతీయుల భావములతోడనే కాక యన్యకాలపు జనుల భావములతోఁగూడఁ బరిచయము గల్గింపఁగలదు.

ప్రతిజాతికి స్వధర్మములు కొన్నియుండి వాని తేజో శక్తులవలన నాజాతి నెన్ని ప్రళయములు వచ్చినను నశింప కుండఁజేయును. యుద్ధములు, విప్లవములు, మొదలైన వాని వలన నన్యజాతులతో సంపర్కముగల్గి ప్రతిజాతియు స్వధ ర్మమందు కొన్ని మార్పులఁజెందుచుండును. జాతులందు తమ ప్రభావముఁ జూపుమార్పుల క్రోడీకరణమే దేశీయచరిత్ర కాఁగ, రాజ్యాంగ మతసాంఘికములను బాహ్యప్రభావము లచే లోకప్రవృత్తియందుఁగలుగు మార్పులఁ దెలియఁజేయు క్రోడీకరణమే వాఙ్మయమగును ఆ మార్పుల కార్యకారణ ముల సంబంధముఁగూర్చియే వాఙ్మయచరిత్ర నిర్దేశించుట. కాన వాఙ్మయ రాజకీయ చరిత్రలన్యోన్యాశ్రయములై, వాఙ్మయచరిత్ర జ్ఞానసంపాదనకు దేశీయచరిత్రయు, దేశీయ చరిత్ర జ్ఞానసంపాదనకు వాఙ్మయచరిత్రయుఁ దోడ్పడును. కాని రాజ్యాంగచరిత్రకంటె వాఙ్మయచరిత్రమున నొక విశేషము గలదు. దేశీయచరిత్ర జాతియొక్క వివిధోద్యమముల, వాని వికాసములను, నచటి రాజకీయ, సాంఘికార్థిక నైతిక మతపరిస్థితులను, నాయాయుద్యమములకు వాని పరిణామము లకుఁగల కారణంబులు మొదలైన బాహ్యప్రవృత్తిని మాత్ర

ము చిత్రింప, వాఙ్మయచరిత్రమట్టి యుద్యమములకు మూల మగు జనుల భావోద్రేకములను, వారి యంతఃకరణములను విశదపఱచు మానసిక ప్రవృత్తిని నిరూపించును. కాన వాఙ్మయచరిత్రము రాజకీయచరిత్రకు వ్యాఖ్యానప్రాయమై, యసమగ్రమైన రాజకీయచరిత్రను సమగ్రముగనొనర్చును.

మఱియు వాఙ్మయమున సారస్వతాభిరుచుల ప్రారంభ వృద్ధిక్షయములను, సారస్వత మతములను విమర్శనప్రమాణములను మాత్రము గుర్తించినఁ జాలదు. ఈ సంకుచితమార్గము తృప్తికరముగా నుండదు. వాఙ్మయమునకు నాకాలమందలి యితర సాంఘికశక్తులకుఁగల సంబంధము నెఱుఁగవలయును. సారస్వత సామ్రాజ్యము గలకాలము నిస్సహాయస్థగా నుండఁజాలదు. వాఙ్మయమును బూర్తిగ గ్రహించుటకు సారస్వత భూములనుండి తఱచుగ దాటిపోయి దానిని పోషించిన సాంఘిక జీవితభూములఁ బ్రవేశించుచుండవలెను. ప్రతి కావ్యమువెనుక కవియాత్మీయత యున్నట్లు, ప్రతి జాతీయ వాఙ్మయము వెనుక నా జాతిలక్షణములున్నట్లు, ప్రతియుగ వాఙ్మయము వెనుక నా కాలపు సాంఘిక జీవితముఁగూర్చిన వివిధ శక్తులుండును. ఆ యుగప్రభావమును వెలార్చుననేక శక్తులలో వాఙ్మయమొకటి. అట్టి శక్తియే యాయుగ రాజకీయతంత్రములందును, మతవిషయములందును, వేదాంత పర్యాలోచనలందును, కళలందు పొర్లి ప్రవహించి యితర రూపముల వ్యక్తీకరింపఁబడును. కాన వాఙ్మయపఠనము రాజ్యాంగవిషయములు, సంఘాచార సంప్రదాయములు, నాజాతి

విజ్ఞానము, నాగరికత, వేదాంత మతములు మొదలైనవానితోఁ గూడిన దేశీయచరిత్రలోనికిఁ దీసి కొనిపోవును. ఒకానొక యుగజీవితమందు భిన్నమార్గములున్నను నవి పరస్పర విరుద్ధములుగాక యొక దానిపైనొకటి యాధారపడియేయుండును. కాన నొకయుగ వాఙ్మయమునకు నా కాలమందు ప్రబలియున్న యితర ముఖ్యశక్తులకుఁగల సంబంధము నెఱుఁగుట ముఖ్యకర్తవ్యము. మఱియు ప్రతియుగము దాని పూర్వయుగము నుండి యుద్భవించిన దనియు, దాని తత్వములు నాశయములు స్థిరములుగానుండక మాఱుచుండుననియు, విశేషించి పరస్పర విరుద్ధముగల తత్వము లాకాలపు నాగరికతయందు నిత్యము ప్రచారములోనుండు ననియు మఱువరాదు. కాన వాఙ్మయము తత్కాలపు సంఘస్థితితోడి సంబంధముఁ గూర్చుటే కాక యితర శాఖాజీవితమందుఁగల సమకాలపు తత్వములను, వాని నెదుర్కొను విరుద్ధ తత్వములఁగూడ ననుసరించును.

యుగప్రభావమును వెలార్చు శక్తులలో రాజ్యాంగ మత సాంఘిక శక్తులు వాఙ్మయముపైఁ బ్రబల ప్రభావముఁ జూపును. సామాన్యముగా దేశమున యుద్ధములు, విప్లవములు మొదలగు కలఁతలు లేక ప్రశాంతముగా నున్నప్పుడు వాఙ్మయాభివృద్ధిగలుగును. తత్కాలపు ప్రభువుల రాజనీతి, పరిపాలనపద్ధతులు, మొదలైన రాజ్యాంగవిషయము లాకాలపు కావ్యములందు ప్రతిఫలించును. యుద్ధములు, విప్లవములు నన్యరాష్ట్రములతో సంపర్కముఁ గలుగఁజేసి రాజ్యాంగవిధానములందు నూతనాదర్శములను, సంఘమున నవీన వార్తా

వరణమును ప్రవేశపెట్టుటచే జనులందు నవీనోత్తేజముగలిగించి ప్రాచీన జీవితాభిప్రాయముల మార్చును. మానవునకు క్రొత్త నొకవింత ప్రాత నొక రోతగజూచుట స్వాభావికముగాన, కవియు సంఘమున నొకఁడగుటచే నానూత్న వాతావరణ మాతని నావేశపూరితుఁజేసి కావ్యరచనకుఁ బ్రేరేచును. ఈ విధమున సారస్వతాభిరుచులు మాఱును. ఇట్టి గ్రంథములు పాశ్చాత్య వాఙ్మయమున విశేషముగఁ గానగును. ఆ కాలమందలి సాహసవంతుఁడైన యొక యోధుని సమరపద్ధతి, దేశసేవకుని స్వార్థత్యాగము, తంత్రజ్ఞుఁడైన యొక యమాత్యుని బుద్ధికుశలత, జనరంజకుఁడైన యొక ప్రభుప్రు ధర్మపరిపాలనావిధానము మొదలైనవి వాఙ్మయమున ప్రతిఫలించును. మఱియొకప్పుడు దేశభక్తిగీతములు, రాజభక్తిగీతములు బయలు వెడలును. విప్లవములు యుద్ధములు దేశములఁ గలఁతపెట్టునపుడుగాని, యన్యజాతీయుల రాజ్యకాలమునఁగాని ప్రజలయందభిప్రాయభేదములు కక్షలు బయలుదేఱి తమ కక్షలు సాధించు పట్టుదల నిమిత్తము వాదోపవాదములతో నిండిన గ్రంథములు బయలుదేరును. ఈ విధముగ రాజ్యాంగ విషయములు వాఙ్మయముపైఁ బ్రభావము నెఱపును.

చతుర్విధ పురుషార్థములలో మోక్షముత్కృష్టమైనదని యెఱింగి జనులందఱు దానిపై శ్రద్ధాభక్తులు వహించి మతమును దానికి సాధనముగా గ్రహింతురు కాన ప్రతి జాతికి నొక మతముండును. లోకమునఁగల సకలవిషయములకంటె మతమిందుచే జనుల బహుశీఘ్రముగను, తీక్ష్ణముగను ద్రిక్తులఁ

జేయును. ప్రతి మానవునకుండు నహంకారాభిప్రాయ భేదముల వలన, స్వమతాభిమానమునుజూపి పరమత తిరస్కారమును జేయును. మతమందుగల దృఢవిశ్వాస మావేశపూరితులంజేసి స్వమతోత్కర్షకు, పరమత దూషణకుంగూడం బ్రేరేచి, తన్మతప్రతిపాదకమైన పాటలు, పద్యములు, వ్రాయించి కావ్యజాలమును పెంచును. ఇట్లు మతావేశము రసావేశముతోం గలసి మేళగించును. ఇట్టి గ్రంథములే పాల్కురికి సోమనాథుని బసవపురాణము, పండితారాధ్యచరిత్రము మొదలైనవి. ఒక జాతివారు మఱియొక జాతివారితో సంపర్కము పొందునపుడు వారి మతముతోంగూడ సంఘర్షణముగల్గి, యొకరిమతముపై మఱియొక రసహనముంజూపి, తమ మతప్రభావమును ప్రకటించుటకై గ్రంథముల సృష్టింతురు. మతకర్తలు గొందఱు రాజుల వశ్యులంజేసికొనుటచే నా దేశపు రాజులుగూడ తన్మతవిషయములంబొల్గొని తమ మతప్రచారణార్థము మతకర్తల చేతను, కవులచేతనా మతప్రతిపాదకమైన గ్రంథముల రచియింపించి వాఙ్మయమును వృద్ధిసేయుదురు. మతప్రచారము ప్రదర్శనరూపముగోరిన ప్రబోధచంద్రోదయ సంకల్ప సూర్యోదయాదులవలె నాటకరూపమును, పఠన శ్రవణయోగ్యమైనచో నష్టాదశపురాణములవలె పురాణవాఙ్మయమును, బాహుటమైనచో బసవపురాణాదులవలె ద్విపదరూపమును గైకొనును. ఈ రీతిగ మతము వాఙ్మయోత్పత్తికిం బ్రేరకమును దాని యభివృద్ధికిం గారణమునగును.

సంఘపరిస్థితులుగూడ వాఙ్మయమందనేక విధములైన గ్రంథముల బయలుదేఱఁదీయును. సంఘమునందుఁగల దురాచారముల ఖండించుటకుగాని సదాచారములఁ బ్రచారము సలుపుటకుఁగాని, నూతన సంప్రదాయములఁ బ్రవేశపెట్టుటకుఁగాని వ్రాయఁబడు గ్రంథములు వాఙ్మయాభివృద్ధికిఁదోడ్పడును. సంఘమందు విశిష్టలక్షణములుగల వ్యక్తుల వేషభాషాప్రవర్తనల ననుకరించు పాత్రల సృష్టించి, తదనుగుణ కథాసన్నివేశములఁగూర్చి కవులు గ్రంథముల రచింతురు. సంఘసంస్కరణమున కిట్టి గ్రంథములు ముఖ్యముగ నుపయోగఁబడును. ఈరీతి గ్రంథములు తత్కాలపు సాంఘికజీవితమునకు దర్పణము వంటివి. ఇందలి కథావస్తువు కల్పితమైనను నీతిదాయకముగ నుండును. ఇట్టి వాఙ్మయమందు వివిధత్వమధికమై, సాంకేతికత్వము తగ్గి యుత్సాహానందములఁగూర్చును. ఈ విధపు గ్రంథములు విశేషముగ నవలలు, నాటకములై యుండును. మృచ్ఛకటికము మొదలైన నాటకములు, కాదంబరి మొదలైన గద్యకావ్యము లీతరగతికిఁజెందినవి. ఈరీతిగ మత రాజ్యాంగ సాంఘిక పరిస్థితులు వాఙ్మయమందు భేదము లేర్పరిచి గ్రంథముల వృద్ధిసేయుటకుఁదోడ్పడును. అందుచే వివిధ యుగములందు భావములు, యోజనలు, నాదర్శములు, రుచులు, శైలి మారుచుండుటచే నొక యుగమందుఁ బాఠకుల నానందపెట్టిన యనేక గ్రంథము లితరయుగములందు నిరసన భావముతోఁజూడఁబడుచున్నవి.

వాఙ్మయము లోకప్రవృత్తి ప్రతిపాదనమే యైనను నది తత్కర్త మనస్సునందేర్పడిన లోకప్రవృత్తి రూపమున కనువాద ముగాన కవివిజ్ఞానము, ప్రతిభాసంపత్తి, వైహికప్రవృత్తి, స్వానుభవములు, నభిరుచులు మొదలైనవానితోఁగూడిన యాత్మీయత దానియందు ప్రతిఫలించుట ప్రకృతి సిద్ధము. ప్రత్యుద్గ్రంథము తత్కవి హృదయమునం దుద్భవించి దాని ప్రతిపత్రమునందతఁడే ప్రతిఫలించును. గ్రంథౌన్నత్యకారణ మాకవి యాత్మీయత మూలమున నూతనోత్పాద్యశక్తితో స్వతంత్రమార్గమునఁ జెప్పుటయందే యుండును. దీనినే ప్రతిభ యందురు. తాను వచింపఁదలఁచు విషయప్రవృత్తితో సన్ని హిత సంబంధము నెఱపి, కవి ప్రత్యక్షముగాఁగన్నులారఁగాంచి తన సూక్ష్మదృష్టితో నామూలాగ్రముగఁ బరికించి, దాని తత్త్వ మును సామాన్య మానవులకంటె నెక్కువైన ప్రతిభాశక్తితో గ్రహించి, యటువిశేషించి తన చమత్కార కళానైపుణ్యము చేఁ దనతోపాటు మనలఁగూడ మన మనోనేత్రములతోఁ జూచి యానందింపఁజేయునట్లు దానిని భాషామూలమున వ్యక్తీకరిం చును. ఉద్గ్రంథములెల్ల ప్రతిభాశాలియగు తత్కర్తప్రశ స్తప్రాణరక్తము వంటివి. అట్టి ప్రతిభాశాలియొక్క భావ ములకు మన సర్వప్రకృతి నున్ముఖముఁగావించి, యతని ప్రాణ రక్తము మన రక్తనాళములలో ధారాళముగాఁ బ్రవహించు నట్లుసేయుటయే సారస్వతవిజ్ఞానము యొక్క ముఖ్యప్రయ త్నము. ప్రయోజనకరమైన యధ్యయన రహస్యమునిదియే. కాన గ్రంథముల విమర్శించునపుడు "యథార్థ స్వరములకు

ప్రతిధ్వనులకుఁగల భేదమును" గుర్తించవలెను. అనగా స్వతంత్రవాక్కుగల్గిన వారికి నితరుల మాటలవినికిశిచే మాట్లాడు వారికి భేద మరయుఁడను.

కవియొక్క యాత్మీయతకొఱకై యాతని గ్రంథమును సూక్ష్మదృష్టితోఁ బరిశీలించి, కవితోఁ బ్రత్యక్ష సంభాషణము జరుగునట్లుగా మనమా గ్రంథమును జదువవగు. అతఁడు చెప్పినది శ్రద్ధతో విని, యతని యోజనలతోడను, భావములతోడను, సహృదయత్వము నెఱపుటకు సర్వవిధముల శక్తివంచనము లేక పాటుపడవలయును. సానుభూతియే వాఙ్మయమును గ్రహించుటకు మూలము. కవి లోకప్రవృత్తినెట్లు చూచినది, దానియందు దేనిని గమనించినది, దానినుండి దేనిని గ్రహించినది మనము జాగరూకతతో గమనించి వ్యవహార ప్రపంచమతని కెట్లు గనఁబడెనో, దానిఁదాను తన యాత్మీయత మూలమున నెట్లు వ్యాఖ్యానము సేసెనో మనము విచారింపవలయును. మానవునితోఁ బ్రత్యక్షముగా మాట్లాడినపుడు మనమాతని శీలము, బలము, లోటుపాట్లు, స్వరము, మొదలైనవానితోఁ బరిచయముఁబొందునట్లు, గ్రంథముఁజదివినపుడు మనమాకవిశీలము, బలము, దోషములు మొదలైనవానితోఁ బరిచయము సంపాదింతుము. గ్రంథములో కవి తన్నుతానెట్లు దెలుపుకొనెనో కూడ మనము దెలిసికొనుట ముఖ్యము. ఇట్టి గ్రంథపఠనము కవి మనస్సును, పాఠకుల మనస్సును బ్రత్యక్షముగా కలుపును. వాఙ్మయము లోకప్రవృత్తికి సన్నిహిత వస్తువు. మన యనుభవ జ్ఞానమును వృద్ధిచేసికొనుట

కును, సామాన్యముగా మనము కలిసికొనుటకు వీలులేని పలువురను సజాతీయులతో సంబంధము గలుగఁజేసికొనుటకు నిది ముఖ్యమార్గము. కాన కవియొక్క యాత్మీయతఁ దెలిసికొనుట కాతని జీవితచరిత్రమును దెలిసికొనుట మనకవసరము. కవి జీవితమెఱుఁగుటవలన కవిస్వభావమునకు నతని కవిత్వమునకుఁగల సంబంధముఁ జూడఁగలము.

వాఙ్మయమందలి శాశ్వతమై యోగ్యమైన గ్రంథమును రచించిన కవి లోకప్రవృత్తితో స్వానుభవమును గాంచిన విషయముల తత్త్వమందాత్మశుద్ధియుఁ గలిగియుండును. అందు చేతనే వాఙ్మయమున యాథార్థ్యముతో మాట్లాడువారి ననేకులువింపరు. ఇతరులెక్కువ జ్ఞానవంతులైన, నెక్కువ శక్తి సామర్థ్యము గలవారైన, నెక్కువ కళాప్రవీణులైనను యాథార్థ్యమును, సక్రమవాక్కును లేనివారిని బెడచెవిని బెట్టి త్వరగా విస్మరింతురు. ఆత్మశుద్ధి ప్రదర్శింపఁబడమి యావ్యక్తియందుఁగాని, యుగమందుఁగానికల సారస్వతక్షయమునకు చిహ్నము. | ఆత్మశుద్ధిలేక వాఙ్మయమున శక్తిసహితమైన యే గ్రంథము జనింపఁజాలదు.| తన యనుభవాత్మశక్తులు ఘనమైనను స్వల్పమైనను, తాను ప్రత్యక్షానుభవముతోఁ జూచి భావించి గ్రహించినవానినే కవి నమ్మకముతో వ్రాయుట ముఖ్య కర్తవ్యమని సారస్వతాధ్యాపకుఁడు మఱువరాదు. ఈ యాత్మశుద్ధియే కవివీరుని ముఖ్యలక్షణమని యొక మహాశయుని నిశ్చితాభిప్రాయము.

వాఙ్మయమనఁగా నిర్దిష్టశిష్ట లక్షణము లనేకముతోఁ గూడినది అగునో? దానిని నెఱుఁగుట వలనఁ బ్రయోజనమే మని ప్రశ్న. ఈ విషయముల నన్నియు గ్రహించి యీ దృష్టితో సారస్వతాధ్యయనము చేసినగాని వాఙ్మయమునఁగలుగు ననేక క్లిష్ట సమస్యలు సాధింపఁబడి సందేహములు నివర్తింపఁ బడవు. ఆంధ్రవాఙ్మయమున నన్నయకుఁబూర్వము కావ్యరచన లేక పోవుట, రాజరాజుకాలమున మాత్రమే కావ్యరచన ప్రారంభ మగుట, యందును నితరకావ్యములు గ్రహింపఁబడక భారత రచనకు మాత్రమే పూనుకొనుట, భారతము సనాతన మత పరముగ రచింపఁబడుట, నన్నయతిక్కనల భారతకవితా రచనలయందలి భేదముండుట, నన్నయతరువాత సుమారు రెండు వందల సంవత్సరములవఱకు భారతము పూరింపఁబడ కుండుట, సమకాలికులైన శ్రీనాథ పోతనల కవితారీతులందు విశేషభేదముండుట, శ్రీకృష్ణదేవరాయల కాలమున నుత్పాద్య ప్రబంధము లుదయించుట, తరువాత కావ్యములందు సాంకేతికత్వము ముదురుట, నద్యతన కాలమున భావకవిత్వము, నవలలు, నాటకములు మొదలైనవానితోఁ గూడిన వివిధత్వ ముండుట, మొదలగు ననేక విషయములకుఁ గల కారణము లీరీతిగఁ జదువుటచే స్పష్టపడును. కాన నీవిధమగు వాఙ్మయ పరిశీలనము సారస్వతాధ్యాపకునకుఁ గావ్యార్థమును సంపూర్ణముగ గ్రహించుటయందు పరమోపయోగముగ నుండును.



# నన్నయ యుగము.

నన్నయభట్టు యుగము పదునొకండవ శతాబ్దమునుండి ప్రారంభమగుచున్నది, కాన తత్పూర్వకాలమనఁగా శాతవాహనుల కాలమునుండి నన్నయవఱకు ప్రాఙ్నన్నయ యుగమనఁబడుచున్నది. ఈ కాలమందలి వాఙ్మయమును గూర్చి యేమియుఁదెలియదు కాన దీని నజ్ఞాత యుగమని కూడ నందురు. దీనికి కారణము వాఙ్మయము ప్రాగభావమా ప్రధ్వంసాభావమా? యని మీమాంస.

నన్నయకుఁ బూర్వము కావ్యము లుండెడివనియు నవి నశించిన వనియు నొక మతమువారు వాదింతురు. రెండవ మతమువారు నన్నయకుఁబూర్వమాంధ్ర కావ్యరచన పుట్టలేదనిరి. పరిణామవాదము ననుసరించి కవిత్వము ప్రతి వాఙ్మయమునను గ్రమక్రమాభివృద్ధిఁ బొందునుగాని, యొక్కమాఱుగా మహోత్కృష్ట కావ్యములు బయలుదేఱఁజాలవు. కాన నపూర్వమైన రసవత్కవిత గల నన్నయ భారతమునకుఁ బూర్వమాంధ్రకావ్యములుండి తీరవలయునని యొకపక్షము. అనాదిసిద్ధమగు సాంప్రదాయము ననుసరించి కవులు దమ మాతృభాషయందు మొదట కావ్యరచనఁ జేసిన తరువాత నితరభాషలందు కావ్యముల వ్రాయుదురు. వేఁగిదేశమందుపుట్టి, క్రీ. శ. 941 సం॥ లో పంప, 948 సం॥లో నాగవర్మ యను కవిశ్రేష్ఠులు కన్నడమున భారత రామాయణముల వ్రాసిరి, కాన వీరు కన్నడరచనకుఁ బూర్వమే యాంధ్రమున కావ్యరచనఁ జేసియుందురు. కాని

వీరు జైనమతస్థులు గాన, జైనమత పరముగా వ్రాయఁబడిన వీరి గ్రంథములను వేదమతము పునరుద్ధరింపఁబడిన తరువాత వైదిక మతస్థులు ద్వేషముఁ బూని వానిని దగ్ధముసేసిరి. ఇట్లు కొంత వఱకాంధ్ర లోకము కారణమాయెను. నన్నయ సమకాలికు లైన వేములవాడ భీమకవి రాఘవపాండవీయమును, నధర్వ ణుఁడు భారతమును రచించి నన్నయకుఁ జూపి రాజదర్శనము సేయింపుమని కోర, నతఁడా గ్రంథముల ప్రాశస్త్యమును జూచి తన గ్రంథమునకు గౌరవమురాదను భీతిచే వారి గ్రంథముల నాశనము సేయించెనని యప్పకవి దన యప్పకవీయమున వ్రా సెను. భీమకవి రాఘవపాండవీయమును రచించినట్లు ప్రవాదు గలదని పింగళి సూరన దన రాఘవపాండవీయమునఁ దెలిపెను. ఇట్లు నన్నయ గూడ వాఙ్మయనాశమునకుఁ గారకుఁడయ్యెను.

చాళుక్యు లాంధ్రదేశ పరిపాలన మారంభించిన నాఁటి నుండియు వైదిక మతమును దేశభాషల నుద్ధరింపఁ బూనిరికాని రాజరాజుకాలము నుండిమాత్రమే కాదు. వారు జైనుల యాంధ్రగ్రంథములఁ దగులఁబెట్టిన వెంటనే బ్రాహ్మణమత ప్రతి పాదకములైన యాంధ్రగ్రంథముల వ్రాయించియుందురు. అట్టి పని నన్నయ కాలమువఱకు జరుగకుండుటచేఁ బ్రాచీన గ్రంథ ములు దగులపెట్టఁబడలేదని నిర్ధారణసేయనగును. మఱియు బ్రాహ్మణమతము ననుసరించిన చాళక్యరాజులే కన్నడదేశమును గూడ పాలించినపుడు కన్నడ భాషయందలి జైన గ్రంథముల దగ్ధముసేయక,యాంధ్రభాషయందలి జైనగ్రంథముల మాత్రమే నాశనము చేసిరనుట విశ్వసనీయము గాదు. తమిళ దేశమున

జైనశైవ మతములకు ఘోరకలహములు జరిగినను తమిళ భాష యందలి జైనగ్రంథములు దగులబెట్టఁ బడలేదు. అట్టి మత కలహము లాంధ్రదేశమున లేకపోయిన నాంధ్ర జైనగ్రంథ ములు ధ్వంసముసేయఁ బడినవనుట కానిమాట. ఇఁక భీమ నాథర్వణులు 12-వ శతాబ్ద పూర్వోత్తరార్థము లందుఁ గ్రమ ముగా నుండినట్లు నిశ్చయింపఁబడుటచే, 11-వ శతాబ్దారంభ మున నున్న నన్నయతో వారిని సమకాలికులఁజేసి నన్నయ వారి గ్రంథముల నాశనము సేసెననుట యసత్యకల్పనము. తనుపరి యాంధ్రదేశముకంటెఁ బూర్వమె కన్నడదేశము చాళుక్యరాజుల చేతిలోఁబడి దేశీయభాష యాదరింపఁ బడుటచేత, నాంధ్ర మున నుత్కృష్ట కావ్యముల వ్రాయు పరిస్థితులేర్పడక పోవుట చేత, నాంధ్రులు జైనమతము నసహ్యించుకొనుటచేతను, కర్ణాటకులు జైనమతము నాదరించుటచేతను, కన్నడమున గ్రంథ రచనఁజేసిన రాజాశ్రయము దొఱకుటను నాశచేత, నాంధ్రదేశ మునఁబుట్టిన పంప, నాగవర్మ మొదలైన జైనమతస్థులు ప్రారంభ మున నాంధ్రభాషయందు గ్రంథ రచనసేయక, కన్నడమున జైన మతపరముగ గ్రంథములవ్రాసిరి. మఱియు జైను లాంధ్రగ్రంథ రచన చేసియుందు రనినఁ దమ ప్రాణములకంటె నెక్కువగాఁ జూచుకొను తమ కావ్యములఁ దమతోఁగూడ కన్నడదేశము నకుఁగొనిపోవరా? అవి తరువాతనైన బయలుపడకుండవా! నేఁటివఱకు నన్నయకు పూర్వపుటాంధ్ర కావ్య మొక్కటైనను బయలు పడకపోవుటచేతను, నన్నయకుఁ బూర్వులైన యాంధ్ర కవుల నన్నయతిక్కనాదు లెవఱు దమ పూర్వకవి స్తుతులలోఁ

చేరొక్కనక పోవుటచేతను, నన్నయకుఁ బూర్వమాంధ్ర గ్రంథ రచన పుట్టలేదని సిద్ధాంతము సేయువలసి వచ్చుచున్నది. మఱియు రాజరాజునకుఁ బూర్వము రాజులును పండితులును సంస్కృత భాషాభిమానమును, దేశభాషానిరసనమును గలవారగుటచేతను, దేవభాషలోని గ్రంథముల దేశభాషలోనికిఁ బరివర్తనము సేయుట పాపహేతువని జనులలో విశ్వాసముండుట చేత, నాంధ్రభాషయందు కావ్యరచన సాగలేదు. కనుక నాంధ్రభాషయందు రసవత్కావ్యములు బయలుదేఱఁగలిగిన యనుకూల పరిస్థితులు నన్నయకాలము వఱకు నేర్పడలేదని చెప్పవచ్చును.

దేశమున రాజ్యాంగ విషయములందుఁ గాని, మతవిషయములందుఁ గాని విప్లవములులేక శాంతియుతమై సుభిక్షముగ నుండి, రాజు కావ్యగీతిప్రియుఁడై కవుల నాదరించినఁగాని వాఙ్మయముదయించి యభివృద్ధిఁ జెందుట కవకాశము గలుగదు. నన్నయకుఁ బూర్వకాల మందాంధ్రదేశమున బలవంతులైన రాజులు బలహీనులైన రాజులఁ జంపి సింహాసనముల నాక్రమించుకొనుచుండిరి. కాన ప్రతిరాజును తన తదనంతరము దన కుమారునకు సింహాసన ప్రాప్తియుండునో లేదోయని యనుమానించుచుండెడివారు. ఈ కాలమున నితరరాజులు దమపై దండెత్తి వచ్చినపు డాత్మసంరక్షణార్థమైకాని, స్వరాజ్య విస్తీర్ణార్థ మితరరాజ్యములపై దాడి వెడలుటచేఁగాని, యుద్ధములలో మునిఁగి రాజ్యాంగ విషయములఁ జక్కపెట్టుకొనుట యందే రాజులకుఁ గాలమంతయు గతించుచుండెడిది కాన,

కావ్యగీతి ప్రియులై సారస్వతాభివృద్ధికిఁ గాల ముపయో గించుట కవకాశముండెడిది కాదు. ఆంధ్రసారస్వ తోదయ మునకుఁ బ్రతిబంధకము లైనట్టి దేశకాల పరిస్థితులఁ దెలిసికొన వలయు ననిన నాయా కాలములందలి భాషామత రాజకీయ పరిస్థితులఁ బరీక్షించిన స్పష్టమగును.

క్రీ. పూ. 220 మొదలు క్రీ. శ. 236 వఱకు శాత వాహన రాజులు శ్రీకాకుల ధాన్యకటకములు ముఖ్యపట్టణ ములుగ నాంధ్ర రాజ్యమును గంగాతీరమునుండి కాంచీపురము వఱకు నేలిరి. అప్పటి యాంధ్రులు గాఢమగు బౌద్ధమతాభి మానులనియు, నాంధ్రదేశము సర్వము బౌద్ధమతాక్రాంతమై యుండెననియు నమరావతి, జగ్గయ్యపేట, భట్టిప్రోలు మొదలగు ప్రదేశములందు బయలువెడలిన శాతవాహనుల నాఁటి స్తూప ములను శాసనములనుబట్టి స్పష్టమగుచున్నది. ప్రాచీనాంధ్ర రాజుల పరిపాలనమున బౌద్ధమతము సమస్త విధముల నత్యు న్నతదశ ననుభవించెను. వేదములు పౌరుషేయములు గానఁ బ్రమాణములు గావనియు, సంసారమంతయు దుఃఖమయ మనియు, సర్వము క్షణయుక్తమనియు, సర్వము శూన్యమ నియు, జన్మరాహిత్యమునకు కర్మసన్యాసము మూలమ నియు, నహింసయే పరమ ధర్మమనియు, బౌద్ధమత సిద్ధాంత ములు. ఈ మతమునకుఁ గర్త బుద్ధుఁడు.

ప్రాచీనాంధ్ర రాజులు బౌద్ధమతాభిమానులును, బౌద్ధ మతావలంబకులైనను బ్రాహ్మణ మతముపట్ల ద్వేషము సూపి నట్లెక్కడను గాన రాకపోవుటయే కాక, బ్రాహ్మణమత

ధర్మములఁగూడ నాదరించిరి. కాన నీకాలమున బ్రాహ్మణ బౌద్ధమతములు శత్రుత్వము లేక యన్యోన్య మైత్రిగలిగి యుండుటచే బౌద్ధమతముతోఁబాటు బ్రాహ్మణ మతముగూడ వర్ధిల్లుచుండెను. బౌద్ధులు బౌద్ధమత ప్రచారముసేసిన ప్రతి స్థలమునకు బ్రాహ్మణమతస్థులు గూడఁబోయి తమ మతమును బోధించిరి. ఈ కాలపు రాజులు మతసహనము గలిగి బౌద్ధమతస్థులను బ్రాహ్మణమతస్థులను సమానముగ గౌరవించిరి. బౌద్ధ సన్యాసులకు దేవాలయములను గుహలను నిర్మించి వారి పోషణార్థమై గ్రామములను భూముల నిచ్చుటయేగాక, కొందఱ అశ్వమేధాది యజ్ఞములఁజేసి బ్రాహ్మణులకు భూరి దక్షిణలిచ్చి యాదరించిరి. బౌద్ధమతాభిమానియు తన్మమతావలంబకుఁడు నగు గోతమీపుత్ర శాతకర్ణుఁడు పల్లవులు, శకనులు మొదలగు వారివలన దేశమునందలి బ్రాహ్మణ సంఘమున వర్ణసంకరము ప్రవేశింపకుండ రక్షించెను. కాన బ్రాహ్మణ బౌద్ధమతములు విరోధములేక దేనిదారి నది దేశమునఁ బ్రబలుచుండెను. ఇందుచే దేశమున మతవిప్లవము లేమియు లేక మతసహనము గలిగియుండెను; కాని రాజకీయపు గందరగోళములు సెలరేఁగుచుండెను. ఈ కాలమున రాజైన శ్రీముఖుఁ డాంధ్రరాజ్య విస్తీర్ణమునకై కాణ్వ వంశీయుఁడగు సుశర్మను జంపి మగధరాజ్యము నాక్రమించుట, గోతమీపుత్ర శాతకర్ణుఁడు రాజ్యమునకు వచ్చుటకుఁ బూర్వము యననపహ్లావ శకనులు తండోపతండములుగా వచ్చి దేశమును బహుకాల మల్లకల్లోలమున ముంచుట, తరువాత గోతమీ

పుత్రుఁడు జనియించి వారల నడచి క్షాత్రపుల నాశన మొనర్చెఁ
మొదలైన యుద్ధములలో మునిఁగియున్నవి కాన దేశకాల పరి
స్థితులు వాఙ్మయాభివృద్ధి కనుకూలముగ లేవు.

బౌద్ధమత గ్రంథములన్నియుఁ బ్రాకృతభాషలో నుండు
టచే బౌద్ధమతావలంబకులైన శాతవాహనుల కాలమునఁ దన్మ
తముతోఁబాటు ప్రాకృతభాషయు నభ్యుదయము వచ్చి రాజకీయ
భాషయై శాసనములన్నియుఁ బ్రాకృత భాషనుండే వ్రాయఁ
బడుచుండెను. ఈ యుగమున యుద్ధములు లేక కొంచెము
ప్రశాంతముగనున్న దినములలో గుణాఢ్యుఁడు బృహత్కథ
యను గ్రంథమును పైశాచీ ప్రాకృత భాషయందు రచించెను.
పిమ్మట కొంతకాలమునకు హాల శాతవాహనుఁడను రాజు
శాలివాహన సప్తశతియను గ్రంథమును ప్రాకృతభాషయందు
వ్రాసెను. ఇది మహారాష్ట్రీ ప్రాకృతమునకుఁ జేరువగా
నుండును. ఈ కాలమున నింతకంటె నేమియు సారస్వతాభి
వృద్ధి గలుగ లేదు.

క్రీ. శ. 230 మొదలు 610 వఱకుఁ బ్రాచీనాంధ్రరాజ్య
పతనానంతరము కృష్ణానదికి వాయవ్యభాగమున నాభీరులును,
పశ్చిమభాగమున రాష్ట్రికూటులును, నైఋతి భాగమున విష్ణు
కుండినులును, పూర్వదక్షిణభాగముల పల్లవులు, ఈశాన్యభాగ
మున శాలంకాయనులు నాక్రమించుకొనిరి. వీరిలోఁ బలువురు
బ్రాహ్మణ మతావలంబకులైనను జైనబౌద్ధమతముల పై
ద్వేషముఁబూనక బ్రాహ్మణ జైనబౌద్ధమతముల సమానముగా
గౌరవించుచుండిరి. పల్లవుల కాలమున జైనమత మాంధ్ర దేశము

బాగుగ వ్యాపించినది. వేదములు పౌరుషేయములుగానఁ బ్రమాణములు గావనియు, సదాచార సురాచారములే జీవుల రక్షణశిక్షణ సేయుచుగాని, యాశ్వరుఁడు లేఁడనియు, నహింస యే పరమ ధర్మమనియు, సృష్టియు జీవులు ననాదులు గాన వినాశము లేదనియు జైనమత సిద్ధాంతములు. ఈ మతమునకు మూలకర్త జినదేవుఁడు

మొదటి పల్లవరాజులు జైన మతావలంబకులైనను గడపటి పల్లవరాజులు భరద్వాజులును, పరమబ్రహ్మణ్యులనియు శాసనములు సెప్పుచున్నవి. వీరిలోఁ గొందఱు శైవులు, మఱి కొందఱు వైష్ణవులు. వీరి కాలముననే ప్రాచీన వైష్ణవ యాళ్వారులు దలయెత్తి యున్నతస్థితికి వచ్చుచుండిరి. మహేంద్ర వర్మయను రాజు మొదట జైనుఁడై యుండి శైవుల బాధించి, తరువాత శైవ మతావలంబియై జైనుల హింసించినట్లు గనిపించుచున్నది. మొత్తముమీఁద కాంచీపురము రాజధానిగ నేలిన పల్లవ రాజులందఱు బ్రాహ్మణమతము నుద్ధరించిరి. పశానుత్సాంగు వాక్యములఁబట్టి వేదవేదాంగ పండితులైన యనేక బ్రాహ్మణులు కాంచీపురమునఁ బల్లవప్రభువుల ప్రాపకముబొంది, వేద పాఠశాలలను, పరిషత్తులను నిర్మించి వైదిక మత వ్యాప్తికై కృషిచేసిరి. అగ్రహారములను మాన్యములను బడసి బ్రాహ్మణులు కాంచీపురమునుండి బ్రాహ్మణులు లేని గ్రామములకు మతప్రచారార్థమై పసఁబడుచుండిరి. ఇప్పటి కింకను శంకరాచార్య లవతరింప లేదు. ఇట్లు దేశమున నీకాల మందుఁగూడ మతవిప్లవము లేమియు లేకపోయినను రాజకీయ

ముగ దేశము క్షుభితమై యున్నది. ఒక దిక్కునుండి కదంబులు, మఱియొకవైపునుండి చాళుక్యులు పల్లవులపై దండెత్తివచ్చి బాగుగ నొత్తిడి గలుగఁజేసి బహుకాలము దేశమును యుద్ధములలో ముంచివేసిరి. ఈ స్థితిలో సముద్రగుప్తుఁడు వీరిపై దండెత్తివచ్చెను. మఱియు రాష్ట్రకూటులతోడను, పాండ్యులతోడను, చోళులతోడను వీరు యుద్ధములు సేయవలసి వచ్చెను. ఈ విధముగ దేశము యుద్ధములలో మునిఁగి విశ్రాంతి లేక పోవుటచే రాజులకు సారస్వతాభివృద్ధిఁ గలుగఁజేయుట కెక్కువ సావకాశము లేకపోయెను. జైన మతస్థులైన మొదటి పల్లవులకాలమున శాసనములు ప్రాకృతమందు వ్రాయఁబడినవి. వైదిక మతావలంబకులైన కడపటి పల్లవుల కాలమున, బ్రాహ్మణమత గ్రంథములన్నియు సంస్కృత భాషయందుండుటచే సంస్కృతభాష విశేషాదరము వడిసి శాసనములుగూడ సంస్కృతమున వ్రాయఁబడినవి. ఈ కాలమున నేలుగ నున్నప్పుడు పల్లవరాజులు దేవాలయముల ననేకము గట్టించుటయందు శ్రద్ధవహించిరిగాని సారస్వతాభివృద్ధికిఁ బాటుపడలేదు.

క్రీ. శ. 610 మొదలు 1022 వఱకు నాంధ్రదేశ చరిత్రలోఁ బూర్వ చాళుక్యులకాలము విశిష్ట లక్షణములతోఁ గూడుకొనియున్నది. ఈ కాలమున రాజకీయ విప్లవములతోఁ బాటు మత విప్లవములు గూడ దేశమును ముంచివేసెను. వీనికిఁ దోడు భాష నూత్నపరిణామమును దాల్చెను.

వేఁగిదేశము పూర్వ చాళుక్యుల వశమైన కొలదికాలమునుండి యొకవైపున గాంగులును, మఱియొక దిక్కున రాష్ట్రి

కూటులును, నింకొకమూల కాళింగులును జుట్టుముట్టుచుండగా వేడిమంగలమువలె మ్రేగుచుండెను. దీనితోఁబాటు కుటుంబ కలహములు సెలరేఁగి రాజులు దమలోఁదాము పోట్లాడుకొని యొకరినొకరు చంపుకొని సింహాసనము నాక్రమించుకొనుచుండిరి. ఈ కారణములచేతనే క్రీ. శ. 640 ప్రాంతమున వచ్చిన హూనుత్సాంగను చీనాదేశ యాత్రికుఁడీ దేశమున నప్పుడు జనసంఖ్య బహు స్వల్పముగానుండెనని తెలిపియున్నాడు. క్రీ. శ. 611 ప్రాంతమున వేఁగీదేశమును స్వాధీనముఁ జేసికొనుటకై పులకేశి పల్లవులపై దాడివెడలి యుద్ధమొనర్చెను. ఈ కాలముననే యుత్తరదేశమునుండి హర్షవర్ధనుఁడు రాజ్యవ్యాప్తికై వేఁగి దేశముపై దండెత్తివచ్చెను. క్రీ. శ. 790-840 వఱకు రెండవ విజయాదిత్యుఁడు రాష్ట్రకూటులతోడను, గాంగులతోడను 108 యుద్ధములుసేసి శత్రువుల జయించి వాని జ్ఞాపకార్థము 108 శైవాలయములఁ గట్టించినట్లు శాసనముల వలనఁ దెలియుచున్నది. బహుకాలము పూర్వ చాళుక్యులకు రాష్ట్రకూటులతో యుద్ధములు దప్పలేదు. క్రీ. శ. 844 మొదలు 888 వఱకు రాజ్యము సేసిన గుణగ విజయాదిత్యుఁడు దన మంత్రియు సైన్యాధ్యక్షుఁడు నగు పాండురంగని సాయమున గాంగులతోడను రాష్ట్రకూటులతోడను బోరినట్లు, నందు పాండురంగఁడు ప్రాణములఁ గోలుపోయినట్లును శాసనములే చెప్పుచున్నవి. అమ్మరాజ విష్ణువర్ధనుని తరువాత నమ్మరాజ విజయాదిత్యుని వఱకు ననగా క్రీ. శ. 925-945 వఱకు నాలుగురు రాజులు కుటుంబ కలహము వలన నొకరి

నొకరు చంపుకొని సింహాసన మాక్రమించుకొనుచుండిరి. మఱల క్రీ. శ. 973-999 వఱకు దేశమరాజకముగా నుండగ 999 సం॥ లో చోళరాజగు రాజరాజ చోళకేసరివర్మ వేంగిదేశముపై దండెత్తివచ్చి, కల్లోలముల నడచి శక్తివర్మను పట్టాభిషిక్తునిం జేసి పోయెను. ఈ విధమున 11వ శతాబ్దారంభము వఱకాంధ్ర దేశము రాజకీయ విప్లవములలో మునిఁగియుండెను.

చాళుక్యులు మొదట నే శూద్రజాతివారో యైనను రాజ్యము సంపాదించినవెనుక చంద్రవంశ క్షత్రియులమని చెప్పికొని యశ్వమేధావభృథ స్నానపవిత్రీకృత శరీరులై వైదిక మతాభిమాన మెక్కువగాఁ గలిగియుండిరి. ఆంధ్రదేశమున ప్రాచీనాంధ్రుల కాలమునాఁడే ప్రచారమున నున్న బ్రాహ్మణ మతము పల్లవులకాలమునఁ గ్రమక్రమాభివృద్ధిఁజెంది, చాళుక్యుల కాలమున నెక్కువగా విజృంభింపసాగెను. పూర్వ చాళుక్యు లీదేశమున రాజ్యమునకు వచ్చిన స్వల్పకాలమునకే, యనఁగా నేడవ శతాబ్దమునందే మహా పండితుఁడైన కుమారిల భట్టు జైమిని సూత్రములలోని పూర్వమీమాంస పరమైన కర్మ ప్రధానమగు వైదిక మతమును బోధించి పాషండ మతముల నడుగంటఁ ద్రొక్కివైచెను. ఇతనికి భట్టపాదుఁడని నామాంతరము గలదు. జైమిని సూత్రముల కితఁడు భాష్యము వ్రాసెను. దీనికి భాట్టమత మందురు. ఈతఁడాంధ్రుఁడు. తైత్తిరీయశాఖవాఁడు, తండ్రి యజ్ఞేశ్వర భట్టు. తల్లి చంద్రగుణ. ప్రస్తుతపు గంజాము జిల్లాయందలి జయమంగళ మనుగ్రామ మందీతఁడు జన్మించెనని జినవిజయమందు వ్రాయఁబడినది.

ఈతఁడు జైనవేషము ధరించి రహస్యములైన జైన గ్రంథముల జైన గురువుల యొద్ద నభ్యసించి, తర్వాత జైనమత ఖండనముఁ జేసెను. వేదములందు వర్ణింపఁబడిన యజ్ఞయాగాది కర్మలు సేయుటవలన ముక్తిగలుగునని యీతని సిద్ధాంతము గనుక నితఁడు కర్మవాది యనఁబడెను. కుమారిలభట్టునకుఁ బూర్వ చాళుక్యులు సంపూర్ణమైన యూఁత నిచ్చుటచే జైనమత నాశనము సేసి వైదిక మతమునకు గట్టిపునాది నాతఁడు వేయఁగల్గి నాఁడు. అందుచేతనే యీతని కాలమున వచ్చిన హూణు త్సాంగు జైనమత మీదేశమున నప్పాటికి క్షీణించి, బ్రాహ్మణ దేవాలయము లనేకము నిర్మింపఁబడుటను గాంచి వగచెను. కుమారిలభట్టు తరువాత తొమ్మిదవ శతాబ్దారంభమున శంకరాచార్యుల వారుద్భవించి ప్రస్థానత్రయ మనఁబడు నుపనిష ద్భగవద్గీతా బ్రహ్మసూత్రములకు భాష్యములవ్రాసి యద్వైత మత సిద్ధాంతముల బోధించుచు, పరమత ఖండనమును, స్వమత ప్రచారమును జేయుచు నాసేతు హిమాచల పర్యంతము సంచా రముచేసి, ధర్మవ్యవస్థకై బదరీ నారాయణ శృంగేరీ జగ న్నాథ ద్వారవతులందు నాలుగు ముఖ్య పీఠముల స్థాపించి, నాస్తికులపై దండెత్తి వాగ్యుద్ధము సలిపి బౌద్ధ జైనమతముల నిర్మూలము చేసెను. శంకరాచార్యులవారు మలయాళ దేశ మున 'కాలెడి' యను గ్రామమున నొక నంబూద్రి బ్రాహ్మణ కుటుంబమున జన్మించి బాల్యముననే వేదవేదాంత విద్యల నభ్యసించి, బ్రహ్మచర్యము నుండియే సన్యాసాశ్రమమును గైకొని 32 సంవత్సరములు జీవించి బదరీకేదారములో ముక్తిఁ

గాంచెను. ఈయన బౌద్ధ దర్శనము లందలి సిద్ధాంతము లనేకము సంగ్రహించి, బుద్ధుఁడు విష్ణువుయొక్క యవతారమని నచ్చఁజెప్పి, పెక్కండ్ర బౌద్ధుల వైదిక మతస్థులుగ మార్చెను. ఈయన బోధించిన యద్వైత తత్త్వము ననేక వైదికబ్రాహ్మణు లంగీకరించిరి. చాళుక్యరాజుల వశముఁజేసికొని యీయన జైన బౌద్ధమతస్థులఁ జంపించెనని యొక ప్రవాదముగలదు. కుమారిల భట్టాంధ్రదేశమునఁ బ్రారంభించిన పని శంకరాచార్యులవారి మూలమునఁ బూర్తియైనది. నిలువ నీడలేక జైనులు వేఁగిదేశమును విడిచిపెట్టి పశ్చిమ చాళుక్యుల పాలనలోనుండి జైనమత ప్రాబల్యముగల కన్నడ దేశమందలి శ్రావణ, బెళగోళ, వాతాపి ప్రాంతములకుఁబోయి యచ్చటి రాజుల యాశ్రయమును బొందిరి. అట్టివారిలో పంప, పొన్న, రన్న వంశీయులు కొందఱు. 10 వ శతాబ్ద మధ్యభాగమున వేఁగి మండలము లోని విక్రమ పురాగ్రహారమునఁ బంప కుటుంబమువారు నివసించు చుండిరి. ఈతని తండ్రి యభిరామ దేవరాయలును, ముత్తాత మాధవసోమయాజియు. అభిరామ దేవరాయలు నాతని కుమారుఁడు పంపకవియు జైనమతమును స్వీకరించుటచే వేఁగి దేశమున నిలువలేక కన్నడ దేశమునకు వలసపోయిరి. పంప సమకాలికుఁడైన పొన్న వేఁగీ దేశములోని పుంగనూరను గ్రామమున నివసించు చుండెను. వీనిది కౌండిన్యస గోత్రము. తండ్రి నాగమయ్య గొప్ప బ్రాహ్మణ పండితుఁడు. ఈతఁడు జైనమతాభిమానము గల్గిన వాఁడగుటచే జైనులదైన కన్నడ దేశమునకుఁ బోయెను. ఈతఁడు సంస్కృత కర్ణాటకములందు

కవితఁ జెప్పఁగల సమర్థుఁడగుటంబట్టి రాష్ట్రకూట రాజగు కృష్ణునివలన నుభయ కవిచక్రవర్తి యను బిరుదముఁ బొందెను. ఇతఁడు శాంతిపురాణమును రచించెను. పంపకవి 941 సం॥లో భారతమును విక్రమార్జున విజయమనుపేర జైన సంప్రదాయములతో కన్నడభాషలో వ్రాసెను. మఱియు నాది పురాణమును మూఁడు నెలలో రచించెను. రన్నయను కవి క్రీ. శ. 997-1008 లో భారత కథను సాహస భీమ విజయమను పేర పది యాశ్వాసముల కావ్యముగ రచించెను. పంప పొన్న, రన్నయను కవులు . కన్నడ వాఙ్మయమున రత్నత్రయ మని చెప్పఁబడుదురు. ఈ విధముగ మతవిప్లవముల వలన వేఁగి దేశమందలి జైనమతస్థులు, ప్రస్తుతము జూసుమతస్థులు జర్మనీ దేశమునుండి తఱిమివేయఁ బడినట్లితర దేశమునకుఁ దఱిమి వేయఁబడుటచే దేశమున యలజడి జనించి జనులకు స్వాస్థ చిత్తతఁ దీసివేసెను

పూర్వ చాళుక్యులు బ్రాహ్మణమతముతోఁబాటు దేశ భాషనుగూడ నుద్ధరించుటచే నాంధ్రజాతికి సజాతీయమైన భాషయొక్క రూపమేర్పడుచు వచ్చెను. ఈ విషయమునే నన్నె చోడుఁడు దన కుమార సంభవములో నిట్లు రచించెను.

కం॥ మును మార్గ కవిత లోకం
బున వెలయఁగ దేశి కవితఁబుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బునఁ జన చాళుక్యరాజు మొదలుగఁబలువుర్ ॥

శాసనములలో గ్రామావధులను దేశభాషలలో వ్రాయు నాచారము చాళుక్యుల నాఁటినుండి ప్రారంభమయ్యెను. దేశభాషయైన యాంధ్రమున వ్రాయఁబడిన యతిప్రాచీనమైన పూర్వచాళుక్యుల శాసనములు క్రీ. శ. 7-వ శతాబ్దమునుండి కానవచ్చుచున్నవి. శాతవాహనాంధ్రుల నాఁటికాలమునఁ బ్రాకృతమై, పల్లవరాజుల కాలమున సంస్కృత సంపర్కమునుఁ బొంది, పూర్వచాళుక్యుల కాలమున 7, 8, శతాబ్దములలో ప్రాకృతవాసన విడలేక, యాంధ్రదేశీయత చేకొత్తి, 9, 10 శతాబ్దములలో తత్సమ శబ్దమయమై, ప్రాకృత స్పర్శ సడలి సంపూర్ణ దేశీయతాముద్రఁదాల్చి యాంధ్రభాష పద్య రచనార్హతను బొందినది. భాష వ్యవహారమునకు మాత్రముండి యనుశాసనము లేక, సంస్కారమును ప్రమాణార్హతయును బొందక సత్కావ్యరచన కర్హము గాని స్థితి యందున్నది.)

భగవదంశ సంభూతులైన మహావీరులు దేశకాల పరిస్థితుల కవసరమగు స్వరూపముల నవతరించి దేశము నుద్ధరింతురు. దేశ మరాజకమైన నాఁడా మహావీరుఁడు ప్రజల శాసించి యోధుఁడై శాంతిసగూర్చి రాజుగాఁ బరిణమించును. మత విప్లవము సంభవించు తఱి నితఁడే నాస్తిక మతముల ఖండించి ధర్మమును సనాతన మతమును స్థాపించి వేదాంతిగా మాఱుచున్నాఁడు. సారస్వతము లేక, రసగ్రహణ శక్తి లేక, నిస్సారమై బీడువారిన కాలమున నా మహావీరుఁడే కవిగా నవతరించి నూత్నచైతన్యమును గూర్చుచున్నాఁడు. పదునొకండవ శతాబ్దారంభమున వేఁగీదేశమట్టి మహావీరులకై యెదురుచూచుచున్నది. అట్టి

తటి నాంధ్రులనోములు క్రీ. శ. 1022 సం॥ జూలై నెల 19-వ తేదీతో సమాసమగు శ్రావణ బహుళ ద్వితీయా గురువారమునాఁడు ఫలించినవి. తెలుఁగువారి సంకల్పములు సిద్ధించెనో యన నాఁటి యుత్తరాభద్రా నక్షత్రకాలమున రాజరాజ నరేంద్రుఁడు రాజమహేంద్రవరమున వేఁగీరాజ్య సింహాసనారూఢుఁడై నాఁడు. వెంటనే యాతని ముఖమున నాంధ్రవాణి చిఱునవ్వు నవ్వినది. ఆ నవ్వు వెన్నెలలు దశదిశలు నిండినవి. ఇది శుభావహ సమయము.

రాజరాజు రాజ్యాధిపత్యము వహించునప్పటికి యుక్త వయస్కుఁడు గామి పట్టాభిషిక్తుఁడైన యనంతరము దన మేన మామయు, చోళచక్రవర్తియునగు గంగైకొండ రాజేంద్ర చోళుని కుమార్తెయగు అమ్మంగదేవిని వివాహమాడెను. బలాఢ్యులైన చోళచక్రవర్తులతోడి వైవాహిక సంబాధము లుండుటచే నీతని రాజ్యమునకు బలమధిక మాయెను. దీనికి తోడు రాజరాజు స్వతస్సిద్ధముగా బలపరాక్రమశాలియై శత్రు రాజుల నణఁగఁద్రొక్కుటచే వైరి వీరు లీతనిఁ దలయెత్తి చూడ లేకపోయిరి. ఉత్తర హిందూస్థానమున ధారాపురము రాజధానిగ మాళవదేశమునేలిన భోజ మహారాజున కీతఁడు సమకాలీనుఁడు. రాజనరేంద్రుఁడు దన కాలమంతయు పరరాజ్యముల జయించుటకై వినియోగింపక, తనకుఁగల దానితో సంతృప్తిఁజెంది భోజరాజువలె కావ్యగీతిప్రియుఁడై సుఖతరంబుగఁ గాలము గడుపుటచే, భోజరాజుకంటె నెక్కువ యదృష్ట శాలియని చెప్పనగును. పూర్వ చాళుక్యరాజులు సుమారం

దలు వైదిక మతావలంబకులగుటచే రాజరాజునకుఁ బూర్వమే దేశమున వేదమత మున్నతస్థితికి వచ్చుటచేతను, నాస్తికమతము లైన జైన బౌద్ధమతములు నిలువ నీడలేక పోవుటచేతను, మత కలహము లేమియు ప్రజలఁ గలఁతఁబెట్టుటలేదు. అందు వలన దేశమున శాంతియు, రాజునకు మనస్స్వాస్థ్యమును జే కూరెను. దేశోపద్రవ కరమగు విషయము లేవియు సంభవిం పక పోవుటచే దేశమంతయు సుభిక్షముగా నుండెను. కాన చాళుక్యరాజులైన తనపూర్వులు ప్రారంభించిన వైదికమత దేశ భాషోద్ధరణములను గొనసాగించుటకు దేశకాల పరిస్థితులు రాజరాజున కనుకూలముగ నుండెను.

అట్టి సమయమున రాజనరేంద్రుఁడు వైదిక మతమునకు మూలమైన 'సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమార్ణ మహినొప్పి' వేదవిద్యావ్యాప్తికై బ్రాహ్మణులకుఁ బెక్క గ్రహార ముల నిచ్చుచుండెను. చంద్రగ్రహణ పుణ్యకాలమున భార ద్వాజ గోత్రుఁడగు చీదమార్యుఁడను బ్రాహ్మణునకుఁ గోరు మిల్లినామ గ్రామమును దానముఁజేసెను. విద్యాప్రియుఁడైన రాజరాజు సంస్కృత కర్ణాట పైశాచికాంధ్రభాషా కవిశేఖరుఁ డైన నారాయణ భట్టునకు నందమపూఁడి గ్రామమును, గణిత శాస్త్రమును రచించిన పావులూరి మల్లనామాత్యునకు నవ ఖండవాడయను గ్రామము నిచ్చెను. ఇట్లు కవులను పండి తుల నాదరించి యగ్రహారములిచ్చి భాషామతముల పోషించిన వాఁడగుటచే రాజరాజును నన్నయ భట్టు భారతమున,

'అగ్రజన్ములకు ననుగ్రహమునఁ

జారుతర మహాగ్రహారంబు లిచ్చుచు
దేవభోగముల మహావిభూతిఁ
దనరఁజేయు చిట్లు మనుమార్గుఁడగు విష్ణు
వర్ధనుండు వంశ వర్ధనుండు'.

అని వర్ణించెను. మఱియు నర్జునుని తీర్థయాత్రా సందర్భమునఁ జేయఁబడిన వేఁగి దేశ వర్ణనయందు.

'ఉర్విలోన ననఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై
ధరణీసురోత్తమాధ్వర విధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేఁగీదేశ విభవంబు'.

అని చెప్పఁబడినది. ఇది రాజరాజు కాలమునాఁటి వేఁగిదేశ స్థితిగాని మూలమైన సంస్కృత భారతమందలిది కాదు.

బ్రాహ్మణమత మభివృద్ధిఁ బొందుచున్న పూర్వ చాళుక్యుల కాలములో వేఁగి దేశమున వేద మత ప్రతిపాదకములైన ధర్మశాస్త్రములు పురాణములుగాఁ జెప్పఁబడుచుండెడివి. ఆ విధముగఁగూడ మత ప్రచారము గలుగుచుండెను. ఇతర పురాణములకంటె స్త్రీ ద్విజేతరులకుఁగూడ నందుబాటులో నున్న పంచమవేదమైన భారతమందే ప్రజలకుఁ బ్రీతి జనించినది.

'అమల సువర్ణశృంగ ఖురమై కపిలంబగు గోశతంబు ను
త్తమ బహువేద విప్రులకు దానముసేసిన తత్ఫలంబు త
థ్యము సమకూరు భారతకథా శ్రవణాభిరతిన్'.

అనుభావము రాజునకే కాక ప్రజలందఱకుఁ గలిగినది. అందుచే భారతమును దీరికగల యప్పుడెల్ల జనులు పురాణ శ్రవణము సేయుచుండెడివారు. శుభకార్యము లందు పురాణములు

చెప్పించుకొనుటయు, భారత ప్రతుల వ్రాయించి పంచి పెట్టుటయు జరుగుచుండెడిది. 7-వ శతాబ్దమున పరమేశ్వర వర్మ యను పల్లవరాజొక దేవాలయమున భారతమును బురాణముగాఁ జదివి చెప్పినవారికై యొక యూరిలో నొక భాగ మొసఁగెనని తెలుపు నొక తమిళశాసనము గలదు. ఆ కాలమున రాజగృహములందు, దేవాలయములందు, ధనికుల యిండ్లయందును బురాణములఁ జెప్పువారు మహా పండితులై యుండిరి. సామాన్యుల యిండ్లలో నే కావ్యపంచకమును జదివినవారో పురాణమును జెప్పుచుండెడివారు. ఇఁక పేదవారు పురాణశ్రవణము సేయవలయుననిన నే సంస్కృత భాషాజ్ఞాన లవముఁ గలవారిచేతనో పురాణముఁ జెప్పించుకొని భావమును మాత్రము విని దానికే మురిసిపోయెడివారు. కొందఱు కామాత్రపు సంస్కృతజ్ఞానముగల పౌరాణికులు గూడ దొఱకెడివారు కారు, కాన ప్రజలు భారతకథ వినవలయు ననిన సంస్కృత పండితులపై నాధారపడి యుండవలసి వచ్చినది. ఆ భారతమే దేశభాషలో నుండినయెడల ప్రజలు దమంతఁ దాము చదువుకొని యానందించెడివారు. మొట్టమొదట మతగ్రంథముల దేశభాషలలో భాషాంతరీకరించి మతప్రచారమునకై బాహాటముగ వినియోగించి సిద్ధసంకల్పులైనవారు బౌద్ధులు. ఈ భాషాంతరీకరణ గ్రంథములు ప్రజల హృదయముల నాకర్షించి మతప్రచారమునకెక్కువ సాయపడును. ఇందు చేతనే జైన బౌద్ధమత విజృంభణచే క్షీణించిన సనాతన మతమును ప్రజాసామాన్యములో పునఃస్థాపనఁజేయుటకై పంచమ

వేదమైన మహాభారతము దేశభాషలోనికిఁ బరివర్తింపఁ బడుట యనివార్యమైనది. | రాజరాజునకుఁ బూర్వమే తమిళమున పెరుందేవనారను కవిచే భారతము రామాయణము కంటె ముందు గద్యపద్యాత్మకముగ వ్రాయఁబడినది.) దీనివలన ప్రాచీన కాలముననే తమిళదేశమున నార్యమత ప్రాబల్యము గలిగి నట్లు దెలియుచున్నది. కన్నడమునఁగూడ భారతము పూర్వమే వ్రాయఁబడినది కదా! ఇట్టి స్థితిలో వైదికమత దేశభాషోద్ధరణలకై కంకణము గట్టుకొనిన రాజ నరేంద్రుఁడు తమిళ కన్నడ రాజులకు బంధుగుఁడై, వారితో సమానుఁడై యుండి వారి వారి దేశభాషలందు భారతము రచింపఁబడుటఁజూచి, తన దేశభాషయందుఁగూడ భారతరచన లేకపోవుట యొక లోపముగా గ్రహించినాఁడు. మఱియు నతఁడు కావ్యగీతి ప్రియుఁడై యుదాత్తరసాన్విత కావ్య నాటకక్రమములఁ బెక్కు చూచిన వాఁడగుటచే భారతము నాంధ్రమున వ్రాయించుట ముఖ్యమని యాతనికిఁ దోఁచినది. అటు విశేషించి 'భారత శ్రవణాసక్తి సతతంబు కరంబిష్టంబై యుండుట 'చేఁ దనకు భారత మభిమాన గ్రంథమైనది. దీనికి,

చ॥ హిమకరు తొట్టి పూరుభరతేశ కురుప్రభు పాండు భూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహినొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్టమెమ్మెయిన్.

అని చెప్పికొనుటచే వంశాభిమానము దోడైనది. భారతము పంచమవేదమగుట చేతను, 'భారత బద్ధస్పృహులగువారికి

నెప్పుడు బహుయాగంబుల ఫలంబు పరమార్థముగుణ' అని విశ్వసించు సనాతన మతావలంబకుఁడగుటచే రాజరాజు భారతాంధ్రీకరణము మూలమునఁ దన పూర్వులైన చాళుక్యరాజులు ప్రారంభించిన వైదికమతోద్ధరణముఁగూడఁ గొనసాగింపఁబడు నని యెంచి తత్కార్యమునకు నిశ్చయించుకొనినాఁడు. కాని రాజు కేవలము కావ్యగీతి ప్రియుఁడును లౌకికుఁడును మాత్ర మేకాక 'సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిగుణ మహినొప్పి' నట్టియు, 'మనుమార్గుఁడు'ను, 'పరమధర్మవిదుండు'ను, 'భూదేవకులాభి తర్పణమహీయః ప్రీతియు, పార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవము' నెల్లప్పుడు మనంబునఁ బాయకుండు వాఁడగుటచే నాతని యభిప్రాయమున కనుగుణముగ నుండునట్లు భారతమువంటి వైదికగ్రంథము నాంధ్రీకరింప వలె ననిన నాతని యాధ్యాత్మిక దృష్టితో సమానమైన సనాతన మతదృష్టిగల కవికిఁగాని సాధ్యముగాదు. అట్టివాఁడు కేవలము రాజాజ్ఞ నెఱవేర్చు విద్వత్కవిగాక ప్రకృతిసిద్ధముగా వైదికమతాచార ప్రవర్తకుఁడైన విద్వత్కవియైనగాని రాజాభిలాషను బూర్తిగ నెఱవేర్పలేఁడు. కనుక తన సభయందు 'రసభావ భాసుర నవార్థ వచనరచనా విశారదులైన మహాకవులనేకు' లున్నను రాజుదృష్టి వారి వైపునకుఁబోక తన పురోహితుఁడైన నన్నయభట్టు దిక్కునకు మరలినది.

నన్నయభట్టు కేవలము షోడశకర్మలఁ జేయించు సాధారణ రాజపురోహితుఁడు గాక సంస్కృతవాఙ్మయము నామూలాగ్రముగఁ జదివిన పండితుఁడు, వేదాంతాభ్యాసుఁడు,

కర్మపరుఁడు, పవిత్రుఁడైన సద్బ్రాహ్మణుఁడు, నమోఘ వచస్కుఁడు, రాజునకుఁ బ్రీతిపాత్రుఁడు. ఇతఁడవిరళ జప హోమతత్పరత, సంహితాభ్యాస మను నాచారసంపత్తియు, లోకజ్ఞత, సత్ప్రతిభాభియోగ్యత, మత్యమరాధిపాచార్యత్వమను మేధాసంపత్తియు, బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞానము, నుభయభాషా కావ్యరచనాభి శోభిత్వము, విపులశబ్దశాసనత్వ మను విజ్ఞానసంపత్తియు, నిత్యసత్యవచనత, సద్వినుతావదాత చరితము, పాత్రత, సుజనత్వ మను సుగుణసంపత్తియుఁగల మహా త్ముఁడు. ఇతఁడు నిష్కల్మషమైన దైవభక్తియు రాజభక్తియుఁ గల వినయవంతుఁడును, మహాగంభీరుఁడును, మితభాషియుఁ బూర్వమీమాంస మతావలంబకుఁడును. మతమున కుమారిల భట్టు శిష్యుఁడు. ఈయన శివవిష్ణుతారతమ్య మరయని స్మార్తుఁ డైనను గర్మమార్గావలంబియని చెప్పవలయును. పోతనయెంత నిష్కల్మషమైన భక్తుఁడో, నన్నయ కర్మలచేనంత నైష్ఠికుఁడు. ఇట్టి నన్నయభట్టుయొక్క స్వగ్రామము సరస్వతీసోమయాజి దన పృథు చరిత్రమునవ్రాసిన యీ పద్యమే ప్రమాణార్హ మైనచో తణుకని నమ్మవలసి వచ్చుచున్నది.

ఉ॥ నన్నయభట్టుగారు యజనంబొనరించినచోట జమ్మిచె
ట్టున్నది తణుకుతూర్పున సమున్నతమై, యలదాని చెంతనే
నున్న తటిన్ శిశుత్వమున నున్నత రీతివరం బొసంగుచున్
నన్నుకృతార్థుఁ జేసితి వనల్ప దయామతి భీమనాయకా.

ఇతఁడు ముద్గలగోత్ర జాతుఁడనియు, నాపస్తంబ సూత్రుఁడనియుఁ దాను భారతమునఁ జెప్పికొనిన పద్యమునుబట్టి తెలియు

చున్నది కాని యీతని తలిదండ్రులు గురువు నింటిపేరు మొద
లైన యితర విషయము లేమియుఁ దెలియరావు.

ఇట్టి నైష్ఠికుఁడైన నన్నపార్యుఁజూచి సంతృప్తి చెంది,
తన కోరిక యీతనిచే నెఱవేఱఁగలదని నిశ్చయించుకొని,
బ్రాహ్మణ మతమును బ్రజలలోఁ బ్రచారముసేయఁ దలఁచు
కొనిన రాజ నరేంద్రుఁడు, కన్నడ తమిళ భారతముల విన్న
వాఁడైనను 'బహు భాషల బహు విధముల, బహుజనముల
వినుచు' నవి తనమతాను సారముగ నుండమి సంతృప్తిగనక
సనాతన మతాను గుణముగ నుండునట్లు,

కం॥ జననుత కృష్ణద్వైపా
యన ముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్ ॥

అని యడిగెను. మఱియు భారతము సర్వ జనాదర పాత్రమైన
గ్రంథముగాఁ బరిగణింపఁబడుచున్నది.

సీ॥ ధర్మ తత్త్వజ్ఞులు ధర్మ శాస్త్రంబని
యధ్యాత్మ విదులు వేదాంత మనియు,
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని,
కవి వృషభులు మహాకావ్యమనియు,
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని,
యైతిహాసికు లితిహాస మనియుఁ,
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁగొని యాడుచుండ

ఆ॥ వివిధవేద తత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరఁగు చుండఁజేసె భారతంబు ॥

కాన నిట్టి భారత భాషాంతరీకరణము పండిత పామరులకుఁ గూడ నుపయోగఁబడును.

కాని దీనికొక ప్రతిబంధకము వచ్చినది. పంచమవేదమై, భగవద్గీతా భూయిష్ఠమైన భారతమును దేవభాషనుండి దేశభాషలలోని కనువదింపఁబడుటకుఁ బూర్వాచార పరాయణులైన పండితు లంగీకరింపరు. మఱియుఁ బురాణములఁ జెప్పుకొని జీవించు సంస్కృత పండితులతో నవసరములేక జనులెవరికి వారే యిఁకముందు పురాణకాలక్షేపముఁ జేయుదురు గాన పండితుల జీవనోపాధుల కడ్డు దగులుటచే భారతాంధ్రీకరణమునకుఁ బండితులందఱుఁ బ్రతిఘటించిరి. తదుపరి భారతాంధ్రీకరణ విషయమున నవలంబింపనగు భాష యే మార్గమున సంస్కరింపఁ బడవలెననియు, నిఁక దేశీయసంస్కృతవృత్తములం దేవేని నుపయోగింప వలెనను సమస్యల నేకము వెడలి సంస్కృతపండితులకు నన్నయకుఁ గక్షలు బయలుదేరి యుద్ధము వలెఁ బరిణమించినది. అప్పుడొంటరిగాఁడైన నన్నయకు రాజనరేంద్రుఁడు సంస్కృత ప్రాకృతాంధ్ర కన్నడాదిభాషల విద్వత్కవి శేఖరుఁడును, కవిభవ్రజాంకుశమను బిరుదుగలవాఁడునగు నారాయణభట్టును సాయమిచ్చి, తానును శాసించి భారతాంధ్రీకరణమునకుఁ దోడ్పడెను. ఈ విషయమునే నన్నయ,

ఉ॥ పాయక పాకశాసనికి భారత ఘోరరణమ్ము నందునా
రాయణునట్లు వాసిగ ధరామర వంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడుం దనకిష్టుఁడుం సహా
ధ్యాయుఁడునైన వాఁడభిమతస్థితిఁ దోఁడయి నిర్వహింపఁగన్॥

భారతము నాంధ్రీకరింపఁ బూనితినని వ్రాసి కొనినాఁడు.

నన్నయయొక్క యీ పద్యమునుబట్టి నారాయణభట్టు నన్నయకుఁజేసిన సహాయ మెట్టిదను విషయమున పలువురకు పలువిధాభిప్రాయములు బయలుదేరినవి. భారత యుద్ధమున నాయుధముఁ బట్టకుండ శ్రీకృష్ణుఁడు దనబుద్ధికిఁదోఁచిన యనే కోపాయముల నెఱిఁగించి యర్జునునకు జయమబ్బఁజేసినట్లుగ నారాయణభట్టుగూడ కలముఁబట్టక యవసరమగు సమయముల బుద్ధిసహాయముఁజేసెనని కొందఱనుచున్నారు. కేవలము బుద్ధిసహాయమేకాక భారతయుద్ధమున క్లిష్టపరిస్థితులందు కృష్ణుఁడాయుధముఁ బట్టినట్లుగ, నారాయణభట్టు గూడ కలముఁ బట్టి కొంత గ్రంథముఁగూడ రచించెనని కొందఱందురు. భారతావతారిక ప్రథమ పురుషయందుండుటచే దానిని నారాయణభట్టు రచించెనని రెండవపక్షము వారూహించుచున్నారు. కాని యిట్లు ప్రథమపురుషలోఁ జెప్పుకొనుట వినయ సంప్రదాయార్థములను బ్రకటించును. భాగవత రంగనాథరామాయణ కర్తలుగూడ నిట్లే చెప్పికొనిరి. ఒకవేళ నవతారికను నారాయణభట్టే రచించెనని యనుకొందమనినను 'పాయకపాకశాసని' కను పద్యముగూడ ప్రథమపురుషలో నుండుటచే నిది యాత్మమత వ్యాఘాతముగానున్నది కాన నన్నయయే యవతారికనుగూడ

రచించెనని చెప్పఁకతప్పదు. ఒకవేళ నారాయణభట్టు కొంత భాగము వ్రాసియేయుండినచో నా విషయమును నన్నయయే స్పష్టముగాఁజెప్పియుండెడి వాఁడు గాని దానిని దాఁచునంతటి కృతఘ్నుఁడుగాఁడు. తన మిత్రుఁడు దనకు సాయముఁజేసెనని యాలంకారికముగా నన్నయచెప్పెనుగాని యంతకంటె నెక్కుడు వ్యంగ్యార్థమేమియులేదు. నారాయణభట్టు కర్ణాటాది బహు భాషలందు పండితుఁడై యా యాభాషలలో భారత పరివర్తన మెట్లుండెనో యెఱిఁగినవాఁడగుటచే నౌచిత్యపోషణకై భార తమున క్లిష్టమైనవ్యాస ఘట్టములందే యేభాగముల విస్తరించి వ్రాయవలసినది యే యే భాగముల తగ్గించవలసినది, శబ్ద ముల సాధుత్వాసాధుత్వ నిరూపణ విషయమును, ఛందో చంపూ మార్గరచనా విధానమునను నన్నయకు మిత్రోపదేశ ముఁజేసి, యతనిపక్షమవలంబించి యుండునుగాని కలముఁబట్టి యే మాత్రము వ్రాసియుండఁడని నిశ్చయముగా నమ్మనగును. ఒకవేళ నారాయణభట్టు ఘంటమునుబట్ట యత్నించెనను కొన్నను నర్జునుఁడు నారాయణుఁడాయుధము గ్రహించి నందు లకు సమ్మతింపనట్లుగ, నన్నయభట్టుగూడ నారాయణభట్టు కలముపట్టి కొంతభాగమును రచించుట కంగీకరించియుండఁడు.

వ్యాసుఁడే యీ మహాగ్రంథమునకు భారతమనియు, సంహితయనియు, జయయనియు భారతమున వ్యవహరించి నాఁడు. పూర్వము దేవతలు భారతము నొకవైపునను, చతు ర్వేదముల మఱియొక వైపుననుంచి తులఁదూచినపుడు భార తమే యెక్కుడు బరువుగలిగి యుండుటచే వ్యాసుఁడీ గ్రంథ

మునకు భారతమని నామమిడెను. మఱియు భరతవంశజుల చరిత్రను జెప్పుటచేనిది భారతమయ్యెను. ధర్మార్థకామమో క్షములకు సాధనమైన గ్రంథముగాన, జయ యనబడినది. పూర్వము జరిగినకథను గ్రమముగనిందు జెప్పఁబడుటచే నితిహాసమనియు, వేదతుల్యత్వమును, వేదార్థ బోధకత్వము దీనియం దుండుటచే సంహితయనియు నామములు సెల్లినవి.

వేదవ్యాసుఁడు సంస్కృతభారతము నించుమించుగా నంతయు పద్యమయముగ రచించెను. కాని యాంధ్రమున నన్నయభట్టు భారతమును గద్యపద్యాత్మకముగ వ్రాసెను. ఈ మార్గముననే తరువాత నాంధ్రకవులందఱు ననుసరించిరి. నన్నయకుఁ బూర్వము 'పెరిందేవనా' రనునతఁడు తమిళభారత మునను, కన్నడవాఙ్మయమున పంప, రన్న, పొన్నయను కవులీ చంపూమార్గముననే యవలంబించుటచేతను, నన్నయకుఁ బూర్వ మందలి శాసనములుగూడకొన్ని యీ మార్గముననే యుండుట చేత, నీ విధపురచన జనుల యాదరమును బడసినదని గ్రహింప నగును. అనేకభాషావేదియైన నారాయణభట్టీ గ్రంథములఁ జూచి, యాకాలపు టభిరుచుల ననుసరించి యాంధ్రభారత మును గూడ చంపువుగా వ్రాయుమని నన్నయకు సలహానిచ్చి యుండవచ్చును. అందుచేతనే నన్నయ భారతమును చంపు వుగా వ్రాసెను.

కావ్యనాటకములు ప్రతిపదార్థభావములు ప్రధానమై నవి కాన వానిభాషాంతరీకరణము మూలానుసరణముగ నుండి తీరవలయును. కాని పురాణేతిహాసములు కథ మాత్రమే

ప్రధానముగాఁగలవి కాన వానిని యథేచ్ఛముగా రసహీనము లైన భాగములను, పదములనుమార్చి, యౌచిత్యముఁగూర్చి శ్లాఘనీయముగఁ జేయవలయును. ఈ పద్ధతినే నన్నయ గ్రహించి సంస్కృతవ్యాస భారతమును ముక్కకుముక్క భాషాంతరీకరణముసేయలేదు. ఆంధ్రమున నితర పురాణ భాషాంతరీకరణకర్తలుగూడ నీమార్గమునే యనుసరించిరి. ఉచితజ్ఞుఁడును రసజ్ఞుఁడునైన నన్నయ భారతము నాంధ్రీకరించునెడ మూల మందలికొన్ని భాగములను సంగ్రహించియుఁ గొన్నింటిని పెంచియుఁ గొన్ని కథలను తాఱుమాఱుసేసియుఁ గొన్నిచోట్ల మూలానుసరణముగాను గొన్నివర్ణనలఁ బూర్తిగా విసర్జించియుఁ గొన్నింటిని నూతనముగాఁ గల్పించియు, ప్రధానకథకు భంగము గలుగకుండ, సర్వవిధముల హృదయంగమముగా నొనర్చి మూల గ్రంథముకంటె భిన్నముగానుండునట్లు రచించెను. (సంస్కృతమున శకుంతల కథ తర్వాతనున్న యయాతి చరిత్రను నన్నయ దన భారతమున నౌచిత్యము కొఱకై దుష్యంతునికంటె పూర్వుఁడైన యయాతివృత్తాంతమును ముందుగాఁ జెప్పుట యుక్తమని యెంచి యట్లుసేసెను.) నన్నయకాలపు సంస్కృతభారత ప్రతులలో నట్లేయుండిన నుండవచ్చును. ధృతరాష్ట్రునకు కణికుఁడు సెప్పిన జంబుకాదుల కథను నన్నయ వదలివేసినాఁడు. మొత్తముమీఁద సంస్కృతభారతము తెలుఁగున క్లుప్తముగా రచింపఁబడినది. అందుచే మూలమున లక్షకుఁ బైగానున్న భారత మాంధ్రమున 50 వేలకంటె నధికములేదు.

| | సంస్కృతశ్లోకసంఖ్య | తెలుఁగుపద్యసంఖ్య |
|---|---|---|
| నన్నయ భారతము. | 21,218. | 10,080. |
| ఎఱ్ఱన ,, | 6,823. | 3,822. |
| తిక్కన ,, | 72,741. | 33,600. |

ఇట్లు స్వాతంత్ర్యముతో వ్రాసి నన్నయ దన ప్రతిభా వ్యుత్పత్తుల భారతమునఁ గనఁబఱచెను.

నన్నయకుఁబూర్వ మాంధ్రమునఁ రచింపఁబడి మార్గదర్శకములగు గ్రంధములేవియులేక పోవుటచేతను, సంస్కృత వాఙ్మయము నామూలాగ్రముగఁదాను చదివిన పండితుఁడగుటచేతను, దన భారతరచన యాకాలమందలి సంస్కృతపండితులఁ గూడ సంతృప్తిపఱచవలసి వచ్చుటచేత, నీతని రచన సంస్కృతానుసరణముగలదై, శైలి సంస్కృత భూయిష్ఠమై యున్నది. వాక్యముల కూర్పుగూడ సంస్కృతమునందువలె విశేషణ విశేష్యములు దూరముగానుండును. ఈతని కవితా శైలి మృదుమధురమై, లలితార్థ చమత్కృతమై, యుచితాలంకార శోభితమై, రసార్థస్ఫూర్తిగలిగి ద్రాక్షాపాకమున సహృదయరంజకమై, పండిత పామరులకుఁ గర్ణరసాయనముగ నుండును. ఈతని కవిత్వమునందు సకలజనులకు సుబోధకమై నిత్యవ్యవహారముననుండి, కటువును క్లిష్టమునుగాక, సరళమైన సంస్కృతపదములు విశేషముగను, దేశీయపదములు కొలఁదిగ నున్నవి. ఇతఁడు సంస్కృతమందలి కటుత్వమును పరిహరించి లాలిత్యమును మాత్రము గ్రహించిన కవి. ఈతని దీర్ఘ సమాసములు 'నిరర్థకరూక్షాక్షర శృంఖలిత కర్ణకఠోరశబ్ద నీ

రంధ్రములుగాక, రసోల్లసిత తత్సమయసముచిత యావదర్థ కలితములై యెంతయు నున్నదనమ్మునందనరు లలిత పదమ్ముల కూర్పున సొబగుగాంచి వీనులవిందు గావించును' ఈతని కవిత్వమందు సముద్రతరంగములవలె గంభీరమగు శబ్దధ్వని యు, పద్యములందు చక్కని యిమిడికయు నర్థసంగ్రహమును గలదు. నన్నయ శైలినిగూర్చి యెఱ్ఱాప్రెగ్గడ హరివంశములో 'నన్నయభట్టు కుంజరంబెన్న నిరంకుశోక్తగతి' యని తెల్పెను. ఈ శైలి గంభీరముగనుండి చదువునపుడొక విధమగు నుత్సా హము గలిగించి సంగీతసాహిత్యముల యేకీభావమువలె నా పాత మధురము నాలోచనామృతమునై విలసిల్లును. నన్నయ కవిత్వ మాలోచించి యర్థము గ్రహింపగలుగువారి కర్థస్వార స్యమాదర పాత్రమగును. మొత్తముమీాద నీతని కవిత్వమం దర్థ యుక్తికన్న శబ్దయుక్తియే యెక్కువగ నున్నది. ఏ పద్య మునకాపద్య మర్థయుక్తిగలదే కాని కథాయుక్తియందచ్చ టచ్చట తొట్రుపాటు కానిపించును. మఱియు 'రసోచిత సందర్భమును, భావ నిరూప రసనిబంధనమును, సందర్భ సము చిత భావమునంతకంతకు మీాఱునట్లును, నయ్యది యెల్లవారికిఁ దేటతెల్లమగునట్లుగను, నింత చమత్కారంబుగల్గియు నప్రయా సముననే రచించినట్లు తోఁపచేయునట్లుగను కవిత్వము వ్రా యుట యసాధ్యమని సహృదయులగు కవిశిరోమణులకు విది తము'. అందులకే కవిబ్రహ్మయైన తిక్కన నన్నయనుగూర్చి

'ఆదిదొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండు వి

ద్యాదయితుండొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్'

అని చెప్పెను. మొత్తముమీద నన్నయశైలి పురాణశైలి. వర్ణనాశైలియు, సంవాదశైలియుఁగూడ నుచితస్థలములందుఁ దగినట్లుగానున్నవి. సౌగంధికాపహరణ ఘట్టమందు హనుమద్భీమ సంభాషణము, బకాసురవధ ఘట్టమున బ్రాహ్మణ బ్రాహ్మణీ సంవాదమునందలి సంభాషణశైలి సహజమును హృదయరంజకముగానున్నది. ఇందు సంస్కృతమును వదలి తేట తెలుఁగుపయోగింపఁబడినది. మయసభావర్ణనము, నింద్రప్రస్థవర్ణనము, గంధమాధనవర్ణనము నందలి వర్ణనా శైలి నిరలంకారముగఁదీర్పఁబడెను. నన్నయకు బహువ్రీహి సమాసముల విశేషముగ వ్రాయుటయందు ప్రీతియధికము. ఈ కవి యుపమ, యుత్ప్రేక్ష, రూపకము, స్వభావోక్తి, యతిశయోక్తి యను నర్థాలంకారముల నెక్కువగా వాడినాఁడు గాని శ్లేషాలంకారము నొకటి రెండుచోట్లఁదప్ప మఱి యెక్కడను ప్రయోగింపఁడయ్యె. ఇందుచే కవికి శ్లేషాలంకారమునందు ప్రీతిలేదని యూహింపఁదగియున్నది. భట్టుమూర్తి మొదలైన యర్వాచీన కవులేకాని ప్రాచీన కవులీశ్లేష నాదరింపలేదు. ఈతని కవితయందు ప్రసాదమాధుర్యాది కావ్యగుణములు, వ్యంగార్థములుఁ బొందుపఱుపఁబడినవి. ఈ కవి యక్కడక్కడ మంచి భాషా జాతీయపు పలుకుబండ నుపయోగించి తన కవిత కలంకారముఁదెచ్చినాఁడు, 'కుంతి కడుపు చల్లగాఁబుట్టిన ఘన భుజుండు' 'కర్ణు సహాయుగాఁబడిసి కౌరవవిభుఁడర్జునువలని భయముసెడి యొమ్మునఁజేయిడి నిద్రపోయె ముదితాత్ముఁడై' మొదలైన వనేకము గలవు.

మానవమానసిక ప్రవృత్తులను వివరించి మానవజీవితో ద్రేకభావములను విశ్వజనీనముగ నుండునట్లనుకరించి స్వభావో క్తితో వర్ణించుట కవిత్వమునకు ముఖ్యలక్షణము. అప్పుడు కవి వర్ణింపఁదలఁచిన దృశ్యము ప్రత్యక్షముగాఁ గన్నులకుఁ గట్టిన ట్టుండిపాఠకుల హృదయము నాకర్షించును. కవి యిట్టి కావ్య కళాదృష్టితో వర్ణింపని పక్షమున నా కవిత్వము మహోత్కృష్ట మైనది కాఁజాలదు. కవికి భావనయు కవితావేశము నుండినఁ గాని యిట్టిరచన సాధ్యముగాదు. ఇట్టి కవితావేశము పొంగి పొరలినఁగాని కవిత్వకళ ఫలోన్ముఖముగాదు. దీనివలననే పాఠకులుగూడ రసోద్రేకమును బొంది విగళిత వేద్యాంతరమైన బ్రహ్మానందమును బొందుచున్నారు. కవి హృదయమున నిట్టి రసోద్రేకము పొంగిపొరలినఁగాని పాఠకులకుఁగూడ నట్టి రసా వేశముగలుగదు. ఈ లక్షణములు తిక్కన కవిత్వమునందు విశేషముగఁ గనఁబడును. ఇందుచేతనే యతఁడు కవిబ్రహ్మయై నాఁడు. ఆంగ్లభాషయందు షేక్స్పియరునకుఁగూడ గౌరవ మీ విధముగ వ్రాయుటచేతనే వచ్చినది. నన్నయయందు పైనఁ జెప్పిన కవితాలక్షణములన్నియుఁగలవు గాని వానిఁ బరిమితముగా వ్యక్తీకరించుటచే నతఁడుత్కృష్టకవితాశిల్పమునందు మాత్రము సిద్ధహస్తుఁడు గా లేకపోయినాఁడు. నన్నయభట్టు స్వభావముచే గంభీరుఁడుగాన నతని హృదయమందగాధమైన భావములు గల్గినను వానిని దమముచే నిగ్రహించి యుద్రేకముతోఁ బొంగి పొరలనీయఁడు. మఱియు నీతఁడు నిత్యసత్యవచనుఁ డగుటచే మితభాషియని యూహింపఁదగినది. ఇట్టితత్తి నతని

మితభాషిత్వము గాంభీర్యగుణమున కనురూపముగ నున్నది. అందుచే నన్నయ దనగాంభీర్య గుణముచేఁ బొంగి పొరలఁ జాలని భావముల మితభాషిత్వముచేఁ బరిమితముగా బ్రక టించును. ఇట్టిది నన్నయ కవిత్వము. ఈతనిపాత్రలు కూడ నిట్టివే. ఇట్టి కవిత్వమును జదువునపుడు పాఠకులు గూడఁ బొంగి పొరలు భావోద్రేకమును బొందఁజాలరు. ఈ విషయము ద్రౌపది కృష్ణునితోఁ దన పరిభవముఁ జెప్పి దుఃఖిం చిన ఘట్టమును రచించిన నన్నయ తిక్కనల పద్యములందు స్పష్టముగాఁ గలదు. నన్నయ రచన:—

వ. నీ యంతఃకరణ ప్రవృత్తి కగోచరం బెద్దియు లేదయి నను నా పడిన పరాభవం బెఱింగించెద.

సీ॥ పార్థివప్రభుఁడైన పాండుమహీపతి
 కోడలనయి యుద్ధ కుశలులైన
పాండుతనూజుల భార్యనై పూజ్యుఁడ
 వైన నీ సఖినినై యధికశక్తిఁ
బరఁగు ధృష్టద్యుమ్ను భగినినై ధృతరాష్ట్రు
 పట్టిచే సభఁదలపట్టి యీడ్వఁ
బడి పాపకర్ముచేఁ బరిధాన మొలువంగఁ
 బడి దారుణంబైన పరిభవంబు

ఆ॥ పడితి నట్టినన్నుఁ బాండవుల్ సూచుచు
నుండి రొరులపోలె నుక్కుదక్కి
యాపగాతనూజుఁడాదిగా గల వృద్ధ
బంధు జనులుఁ జూచి పలుకరయిరి॥

క౦॥ శరణనిన వారిఁ గరుణా
కరులయి రక్షించు పురుషకారాన్వితులే
శరణని యఱచిన నాలిం
పర భీమార్జునుల బాహుబల మేమిటికిన్ ॥

వ. భ్రాతృపుత్రబాంధుజనంబులు నాకుం గలిగియు లేని వారయి రట్టియెడం గర్ణుఁడు నన్నుఁజూచి నగియె.

ఆ॥ కర్ణునగవు లోకగర్హితుండగు దుస్స
సేను చేయిదికంటె శిఖియపోలె
నడరి నామనంబు నతి దారుణక్రియ
నేర్చుచున్న యది మహీధరుండ ॥

వ. తొల్లి వేదాధ్యయనంబు సేయుచు బాలకేళీ వినోదంబున నున్న కాలమునఁ బ్రమాణకోటియందు సుప్తుండైన భీమసేను నంటఁగట్టి గంగమడువునం ద్రోపించియు, విషంబుఁ బెట్టియు, విషసర్పంబులం గఱపించియు, జననీసహితులైన యేవురను వారణావతంబున లక్క యిల్లు సొనిపి యందు దహనంబుఁ బ్రయోగింపం బంచియు ననేకంబులైన యపకారంబులు సేసి యిప్పుడు దుర్యోధనుం డధర్మద్యూతంబున రాజ్యంబు నపహరించి రాజలోక సమక్షంబునం దమ్ము నిరాకృతులం జేసినను బరాక్రమ పరాఙ్ముఖులైన పాండవులు నాపరిభవంబు నెట్లు దలఁగెదరని బాష్పధారా స్నపితపయోధరయై పాణిపల్లవంబుల నయన సమ్మార్జనంబు సేయుచున్న పాంచాలిం జూచి వాసుదేవుం డిట్లనియె. ఆరణ్య. I. 135-140.

ఇఁక తిక్కన రచన యెట్టిదనిన,

తే॥ ధర్మనందను పలుకులు దనకు హృదయ
తాప మొనరింప మోమున దైన్యమంద
నున్నపాంచాలి యిట్లని యొయ్యఁబలికెఁ
గనలి శౌరితో గద్గదకంఠి యగుచు

ఉ॥ వరమునఁబుట్టితిన్ భరతవంశముఁజొచ్చితి నందుఁబాండుభూ
వరునకుఁగోడలైతి, జనవంద్యులఁ బొందితి నీతివిక్రమ
స్థిరులగు పుత్రులంబడసితిన్ సహజన్ముల ప్రాపుఁగాంచితిన్
సరసిజనాభ యిన్నిటఁబ్రశస్తికి నెక్కినదాన నెంతయున్ ॥

వ. అట్లుంగాక

ఉ॥ నీవు సుభద్రకంటెఁ గడునెయ్యము గారవముందలిర్ప సం
భావనసేయు దిట్టిననుఁ బంకజనాభ యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణివట్టి యీ
యేపురుఁజూడగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే ॥

ఉ॥ ఆసభ కేకవస్త్ర యగునట్టి ననుంగొనివచ్చి నొంచు దు
శ్శాసనుఁజూచుచుం బతులసంభ్రములై తగుచేష్టలేక నా
యాసలుమాని చిత్రములయాకృతి నున్నయెడన్ ముకుంద వి
శ్వాసముతోడ నిన్ గొలువవచ్చె మనంబదియుం దలంపవే ॥

చ॥ అరయమిఁజేసి కోడలనకప్పుడు దాసిగఁజేసె నమ్మహా
పురుషుని పాలికింబతులు పోవఁగ వీరలతోన యేనుజె
చ్చెరఁజని కోటరంబుఁ దగఁజేయుదునో యటుగాక పాడిమై
వరప్రద మోపిచేయుదునో వారికి మాధవ నిశ్చయింపుమా.

వ. అని యట్లుగ్గడించి

ఉ॥ ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెండ్రుకల్
దా వలచేతఁబూని యసితచ్ఛవిఁబొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగు విషాదరోషముల్
గావఁగలేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గనలేచి యార్తయై

వ. గోవిందు ముందటంబెట్టి యిట్లనియె

కం. ఇవి దుస్ససేను వ్రేళ్లం
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి కౌ
రవులకడఁ దీఱుమాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత వీనిన్ ॥

సీ. ఈ వెండ్రుకలు పట్టి యీడ్చిన యాచేయి
దొలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింతలింతలు తునియలై చెదరి రూ
పఱి యున్నఁగని యుడుకాఱుఁగాక
యలుపాలఁ బొనుపడునట్టి చిచ్చేయిది
పెనుగద వట్టిన భీమసేను
బాహుబలంబును బాటించి గాండీవ
మనునొక పిల్లెప్పుడును వహించు

ఆ॥ కట్టి విక్రమంబు గాల్పనే యిట్లు బ
న్నములు వడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పీనుంగుఁ గన్నారఁ
గానఁ బడయ నైతి మేనిఁ గృష్ణ ॥

ఉ॥ నెట్టన యిట్టియల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును గాలము దీనికి నాఱుటెన్నఁడుం

బుట్టదు దుష్ట నిగ్రహము పూని జగంబులు గాచునట్టి తోఁ
బుట్టువు నీవుఁ దేజమునఁబొల్చిన భర్తలుఁగల్గ నచ్యుతా॥

వ. అనుచు నెలుంగురాలుపడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుండై నారాయణుండూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు దుడువను బెన్నెఱివేణి ముడువనుం దగు వారి నియోగించి యమ్మానినితో నిట్లనియె. ఉద్యో. iii. 100—119.

వీనిఁబట్టి తెలియనగు విషయములివి. నన్నయ యొక మహాభావమందలి వివిధావస్థలను గ్రోడీకరించి యేకముఖంబునకుం దెచ్చి భావగాంభీర్యముఁగూర్చును. ఇఁక తిక్కన మహాభావమందలి వివిధావస్థలను వేఱువేఱ విస్తరించి బహుముఖములనిచ్చి భావమును సరళముగఁజేయును. నన్నయ గుణవాచకము లందర్థము నిమిడ్చి యవాంతరావస్థల వ్యాప్తిని నిరోధించి భావము నుద్రేకరూపముఁగొని పొంగిపొరల నీయఁడు. తిక్కన గుణవాచకములందలి భావమును విపులీకరించి యవాంతరావస్థలంగూడ వ్యాపింపఁజేయుటచే భావమావేశరూపముఁదాల్చి పొంగి పొరలును. నన్నయ యసమాపక క్రియలనేకముగల యొక్క మహావాక్యము (compound sentence) తో పద్యమునంతయు నింపి సంస్కృత పదముల సమాసమునఁ గూర్చి శబ్దగాంభీర్యముఁ దెచ్చును. తిక్కన చిన్న చిన్న వాక్యముల నేకములొక్కపద్యమం దిమిడ్చి తేటతెలుఁగు మాటల పలుకు నుడికారమున సరళత నాపాదించును. కాన నన్నయరచన కరడుగట్టిన దధివలె స్నిగ్ధమైయుండ, తిక్కనరచన క్షీరమువోలె జాలువాఱు చుండును. నన్నయ నిశ్చలసన్ని వే

శముల (motionless situations) దక్షతతో వర్ణించు టయందు ప్రతిభావంతుఁడు. తిక్కన సన్నివేశముల చలనత్వ మును (situations of action) జిత్రించుట యందునేర్పరి. నన్నయ మానసిక భావముల మాత్రమువర్ణింపఁ దిక్కన హావ భావ విలాసముల పరస్పర వ్యాపారములను రచించుట యందు దక్షుఁడు. నన్నయ యేకైక భావముల (single feelings) మాత్రము కృతార్థతతో వర్ణింపఁగలఁడు. తిక్కన భావ మిశ్రమముల (combination of feelings) వర్ణించుటయందు నైపుణ్యముఁ జూపును.

నన్నయ సీసపద్యభాగమందలి 'పార్థివప్రభుఁడైన...... ......పరిభవింపఁబడితి' నను భావము మహావాక్యమున వ్యక్తీకరింపఁబడుటచే గంభీరముగనున్నది. ఈ భాగమునే తిక్కన చిన్నచిన్న బహు వాక్యములుగా విభాగించి రెండు పద్య ములఁజేసి భావసరళతఁ గూర్చినాఁడు. నన్నయ 'పాండుమ హీపతికోడలనై, పాండుతనూజుల భార్యనై, ధృష్టద్యుమ్ను భగినినై' యనుభావములను వీరపురుషోచిత లక్షణములగు 'పార్థివప్రభుఁడు, యుద్ధకుశలులు, అధికశక్తిఁబరఁగు' అను విశే షణములఁ గ్రమమునఁ గలిపి యర్థఁగాంభీర్య మొసఁగినాఁడు. తిక్కన యీ భాగమందుఁ 'బాండుభూవరునకుఁ గోడలనైతి, జనవంద్యులఁ బొందితి, సహజన్ముల ప్రాపుగాంచితిఁ' అని మాత్రము చెప్పుటయేగాక, 'వరమునఁ బుట్టితిఁ' అని చెప్పి యామె యయోనిజత్వమును, 'భరతవంశముఁజొచ్చితి' నని తెలిపి తద్వంశకీర్తియు, 'నీతివిక్రమస్థిరులగు పుత్రులంబడసితి'

నని పలికి యామె పుత్రవతియును నుత్కృష్టలక్షణములఁగూడఁ గలిపి ద్రౌపదికౌన్నత్యముఁగూర్చి, చివరకు 'ఇన్నిట ప్రశస్తికి నెక్కినదాన' ననిపించి యాత్మగౌరవము గలదానిగఁజేసినాఁడు. ఈ విధముగ ద్రౌపది యత్యున్నత గౌరవస్థానమునకుఁ గొనిపోఁబడినగాని ముందు తెలుపఁబోవు పరిభవము దారుణమై తీక్ష్ణముగఁ గనుపింపదు. ఇది భిన్నత్వముఁ (contrast) బ్రకటించు మార్గము. ఈ విధముగ నవాంతరావస్థల వ్యాపింపఁజేసి తిక్కన రసపోషణము సేయును. ఈ పద్యమున కవి యెన్ని వాక్యముల వాడెనో చూడుడు.

నన్నయ 'పూజ్యుఁడవైన నీసఖినినై' యని వ్రాసిన భాగమును తిక్కన 'నీవు సుభద్రకంటెఁ గడునెయ్యము గారవముం దలిర్ప సంభావన సేయుదిట్టినను' అని విపులీకరించి చక్కగ భావపోషణ చేసినాఁడు. వరుసచే ద్రౌపది కృష్ణునకు సోదరి. ఈ విషయమును మాత్రము సెప్పి, కృష్ణునకు గౌరవార్థము 'పూజ్యుఁడ'ను విశేషణమును గలిపినాఁడు నన్నయ. అంతే. తిక్కన యింకనొక్క మెట్టు పైకిపోయి శ్రీకృష్ణునకు ద్రౌపది యందుఁగల సోదరీభావమెంత యుత్కృష్టమైనదో చూపించినాఁడు. కృష్ణుని స్వసోదరియైన సుభద్ర ద్రౌపదికి సవతి గదా! ఇట్టి స్థితిలోఁ గృష్ణుఁడు దన స్వసోదరి కంటె ద్రౌపది నెక్కువ నెయ్యమున గౌరవించునా యని యందురేమో? ఇది యసాధ్యవిషయమైనను నసంభావ్యముగాదు. ప్రపంచమున నొకఁడు మఱియొక చిన్నవాని నాదర్శప్రాయముగఁ బ్రేమించుచో 'కుమారుని యందుకంటె నెక్కువ

ప్రేమఁజూపుచున్నాడ'ని చెప్పుట లోకసహజముకదా! అట్టిదే యిది. ఇట్లు చెప్పుటయే యెక్కువ స్వారస్యముగాని యీ సందర్భమునఁ గృష్ణుని గౌరవముఁదెల్పు విశేషణములవాడిన భావపోషణము గలుగదు. ఇట్టి యౌచిత్యమునందే తిక్కనార్యుని కళ గానవగు. నన్నయ 'ధృతరాష్ట్రుపట్టిచే సభఁదలపట్టి యీడ్వఁబడి' యని వ్రాసిన భాగమును తిక్కన 'యొకండు వేణిపట్టి సభకు నీడ్చె' నని వ్రాసియట్టి పాపకార్యముఁ జేసిన నీచుఁడైన దుశ్శాసనుని పేరైన నుచ్చరింపక తిరస్కారముద్రతో నెవఁడో పాపి 'యొకఁడ' న్నట్లు వ్రాసి రసపోషణముఁ జేసినాఁడు. మఱియు ద్రౌపది వేణికౌన్నత్యముఁ గూర్పఁదలఁచి 'రాజసూయావభృథమ్మునందు శుచియై పెను పొందిన' యను విశేషణమును వాడినాఁడు. అట్టి పవిత్రమైన వేణిని పాపియొకఁడు ముట్టెనని చెప్పుటచే నందలి భిన్నత్వముఁ (contrast) దెలిపి రసపోషకమగుచున్నది. దీనికిఁ దోడు 'ఈ యేవ్వరుఁ జూడగా' నని కలిపి దుశ్శాసనుని సాహసమెట్టిదో చూపినాఁడు. పిమ్మట 'కులాంగన నిట్లొనర్తురే' యని ద్రౌపది శ్రీకృష్ణునికి నివేదించుచుఁ దా నాయవమానమెంత తీక్ష్ణముగ ననుభవించెనో సూచించెను.

నన్నయ వ్రాసిన 'పాపకర్ముచేఁ బరిధానమొలువంగఁబడి దారుణంబైన పరిభవంబు పడితి నట్టినన్ను పాండుపుల్ సూచుచునుండి రొరులపోలె నుక్కుదక్కి' యనుభావమును తిక్కన విస్తరించి 'ఆ సభ కేకవస్త్రయగు' అను పద్యమును వ్రాసినాఁడు. నన్నయ 'పరిధాన మొలువంగఁబడి' యని

పచ్చిగా వ్రాయఁగా తిక్కన 'నొంచు' అని సున్నితముగాఁ జెప్పినాఁడు. మానినియైన ద్రౌపది కృష్ణునితోఁ బ్రత్యక్షముగాఁ జెప్పునపుడిట్లు పచ్చిగా మాట్లాడుట యసభ్యము గాకుండునా? నన్నయ 'పాపకర్ముచే, దారుణంబైన' యనుపదముల వాడి పరిభవ భావమును బోషించినాఁడు. తిక్కన 'యేక వస్త్ర' యని వాడి యర్థపుష్టిఁ గలుగఁజేసినాఁడు. 'పాండవుల్ సూచుచుండి రొరులపోలె నుక్కుదక్కి' యనుభావమును తిక్కన 'చూచుచుంబతులసంభ్రములై తగు చేష్టలేక నా యాసలుమాని'యని చెప్పి, 'చిత్రముల యాకృతినున్న' యని యుపమానమును దెచ్చినాఁడు. నన్నయ యీ పరిస్థితినే మఱి కొంత శక్తివంతముగాఁ జేసి 'శరణనినవారి' అను పద్యమున విస్తరించినాఁడు. కాని ద్రౌపదిచే 'భ్రాతృపుత్ర బంధు జనంబులు నాకుంగలిగియు లేనివారయిరి' యని 'భ్రాతృ బంధు' శబ్దములఁగూడ వాడి కృష్ణుఁడు సేసిన యుపకారమును స్మరింపఁజేయలేదు నన్నయ. ఇట్టియెడ తిక్కన 'ముకుంద విశ్వాసముతోడఁ గొలువవచ్చె మనంబదియుం దలంపవే' యని వ్రాసి యౌచిత్యముఁగూర్చి, ద్రౌపదికి గత్యంతరము లేని స్థితియు, కృష్ణునియందలి భక్తియు, నతని యౌదార్యమును సూచించినాఁడు. నన్నయ ద్రౌపదీ పరాభవమును వృద్ధిసేయఁదలఁచి కర్ణుఁడు నవ్విన వృత్తాంతమును జెప్పించినాఁడు. ఇది గోరుచుట్టుపై రోకటి పోటువలెనున్నది. దీని తర్వాత ద్రౌపది పూర్వము కౌరవులు దమకుఁజేసిన యపకారముల నన్నింటిని నేకరువుపెట్టి దుఃఖించినది. తిక్కన యీ

విషయములందలపెట్ట లేదు. ద్రౌపదీవస్త్రాపహరణ విషయ మునందు మాత్ర మేకాగ్రత వహించి మానసికవ్యాపారములం గ్రమముగాఁ బోషించుచు వచ్చినాఁడు.

ఆర్తత్రాణ పరాయణుఁడై, దుష్టశిక్షణ శిష్టరక్షణార్థ మవతరించిన శ్రీకృష్ణునితో ద్రౌపది స్వవిషయముఁజెప్పు టకుఁ బ్రారంభించి యాత్మగౌరవ ప్రతిపాదకములైన తనపరిస్థితుల నన్నిటిని మనవిచేసికొని 'ఇప్పటఁబ్రశస్తికి నెక్కినదాన నెంతయు' నని చెప్పి కొంచెమాఁగినది. శ్రీకృష్ణుఁడామె వాక్యలందు గౌరవముసూపి సావకాశముతో వినుచుండుట గుర్తెఱిఁగి ద్రౌపది, యాంతియకాక విశేషించి 'నీసోదరికిఁ గలిగిన యవమానము వింటివిగదా' యనురీతి 'నీవు సుభద్రకంటె' యని మొదలిడి తన పరాభవ విషయమును తీక్ష్ణముగ నుండునట్లుసేసి 'కులాంగన నిట్లొనర్తురే' యనిభావగర్భితముగను, శ్రీకృష్ణుని యంగీకార సూచకముగాను, బ్రశ్నించుధోరణి నుడివినది. దీనిని గృష్ణుఁడాత్మ విషయముగ గ్రహింపఁగ ద్రౌపదికి జరిగిన యధర్మము దన హృదయమును జలింపంజేసినది. కృష్ణుని మనోభిప్రాయముఁగనిపెట్టి ద్రౌపది యటు పిమ్మటఁదన భర్తల యుపేక్షయుఁదన యసహాయస్థితియుఁ దెలిపి కృష్ణుఁడు దన కట్టియెడ నొనర్చిన మహోపకారముఁ దలపెట్టి యతనిభావము నకుఁ బురిఁయెక్కించినది. ఇప్పుడు కృష్ణుని విశ్వాసమును బూర్తిగ గుర్తించి ద్రౌపది ధృతరాష్ట్రుఁడు దన్ను దాసిగఁ జేసిన చేఁతల స్ఫురణకుఁ దెచ్చి తమ ముందుస్థితి యేమని నిశ్చయింపఁదగునని ప్రశ్నించినది. కృష్ణుఁడు ద్రౌపది మహోక్లేశ

ముతో సానుభూతినిఁబొంది సిశ్చేష్టుఁడై! కేవలము మాటలతో నామె నోదార్పఁదగిన సందర్భముగాదని యెంచి యూరక వినుచుండెను, ఇంతవఱకు ద్రౌపది తన హృదయ తాపమును, గొంతవఱకు గాంభీర్యముతో నిగ్రహించుకొనుచువచ్చి, పొంగి పొరల నీయలేదు. కాని యిప్పుడామె దుఃఖావేశమునకు వశ్యురాలై పోయినది. ఆమె రక్తనాళములందు ప్రవహించు రుధిర ముడికిపోయి, విషాదాగ్నిజ్వాలలు ప్రజ్వలించి శరీరమున రోమాంచము మూలమునఁ బ్రకటింపఁబడఁగ దన హృదయమందలి దుఃఖ ముద్రేకరూపముఁదాల్చి పొంగి పొరలఁగ నాపుకొనలేకపోవుటచేఁ గంటికొలఁకులఁ వేఁడి కన్నీరుఁజార్చినది. అవమాన స్మారకములగు తన శిరోజముల స్పృశించినంతనే యామె దఃఖము రోషముగాఁ బరిణమించినది. అవమాన దుఃఖము కోపముగా మాఱి ప్రతిక్రియానంతరముగాని యుపశమింపకుండుట విశ్వజనీన విషయమేకదా! ఆమె విషాదరోషముల సంఘర్షణ దుర్భరమై ప్రతీకారమునకుఁ గృష్ణుని ప్రేరేచినది. వెంటనే 'ద్రోవది బంధురంబయిన ......... దిగ్గనలేచి యార్తయై' దుస్ససేనాపకృష్ట ఛ్ఛిన్నావశేషంబులైన తన శిరోజములఁ గృష్ణుముందటఁబెట్టి వానిని మాత్రము సంధి సందర్భమున విస్మరింప వలదని వ్యంగ్యముగాఁజెప్పినది. తన పరాభవ క్లేశముతో సానుభూతిఁ జూపిన కృష్ణుని యంతఃకరణము సంధిసమయమున నామె శిరోజముల స్మరించినచో సంధి విఘాతముఁ గలుగఁజేయు నని గ్రహించియే యిట్లు సేసినది. తరువాత ద్రౌపది దన పరాభవానలము దుశ్శాసనుని శరీరము

చిన్న చిన్న ముక్కలుసేసినగాని శాంతింపదనియు, దుర్యో ధనునిపీనుఁగుఁ గన్నారఁదాను జూడకపోయినచో భీమార్జునుల పరాక్రమముఁగాల్పనా యనియుఁ బలికి రోషోద్రిక్తయగు స్త్రీ స్వభావముఁ జూపినది. ఇది లోకప్రవృత్తి. పిమ్మట 'పరా క్రమ పరాఙ్ముఖులైన పాండవులు నా పరాభవ మెట్లు దలిగెద ర'ని కథాకథన రీతిఁజెప్పిన నన్నయ భాగమును తిక్కన విస్త రింపఁజేసి ద్రౌపది చివ్వోడిం గట్టినట్లుగాఁ జాలకాలము నుండియు ననుచితమైన యోర్పుపట్టినదని తన రోషోత్కృష్టతఁ దెల్పి, దుష్టశిక్షణసేయు సోదరుండైన శ్రీ కృష్ణుఁడును, తేజోవంతులైన పతులుఁగల్గియు నీ పరాభవాగ్ని యార్ప వారెవరు లేరా! యని యడిగి కృష్ణుని మీఁదఁగూడ పరాభవ ప్రతీకార భారమునువేసి, వెక్కి వెక్కి యేడ్చినది. ఎట్టి గంభీరు రాలైనను, నెట్టిరోషావేశయైనను, నెట్టి వీరపత్నియైనను, నెట్టి మానినియైనను స్త్రీ స్వభావమైన శోకమును దాఁటలేదుగదా! ఈ తత్త్వముఁబూర్తిగా నెఱిఁగియే ద్రౌపది శౌరితో గద్గదకంఠి యగుచుఁ బలికెనని ప్రారంభమున తిక్కన తెలిపినాఁడు. ఇది స్త్రీ పురుషులకుఁ గల ప్రకృతిభేదము. ఇప్పుడు కృష్ణునికిఁ గూడ హృదయము కరిగిపోయినది. ఆతని నయనములందుఁ గూడ బాష్పములు తిరిగెనేమో! కృపాయత్త చిత్తుఁడైనాఁ డట. ద్రౌపది వాక్యములకుం గావలసిన ప్రతిఫలమే యిది. నన్నయ 'వాసుదేవుడిట్లనియె' యని చప్పగ వ్రాసి యూరకొని నాఁడు. నన్నయ ద్రౌపది గాంభీర్యము గలదై కన్నీరు మాత్రముజార్చి తనకుఁదానే నయన సమ్మార్జనముఁ జేసికొని

శాంతించినది. తిక్కన ద్రౌపది యెలుగురాలుపడ నేడ్చి దుఃఖవివశయై, తెప్పిరిల్ల లేకపోవుటచేఁ గృష్ణుఁడామెనోదార్చి యుపచారములకై తగువారిని యోగించినాఁడు. ఈరసవత్సన్ని వేశమును వర్ణించు తిక్కన కథను జెప్పుటయే కాక, ద్రౌపదీ మనోభిప్రాయములఁ దెల్పుటయే కాక, యామెమానసిక వ్యాపార పరివర్తనక్రమమును నిర్దేశించుటయే కాక, యామె దుఃఖావేశము కోపావేశముగ మాఱుస్థితియందలి యావేశ చలనత్వమును జూపుటయే కాక, యామె వక్తృత్వనైపుణ్యముఁ జూపుటయే కాక, నాటకరంగస్థలమందలి పాత్రల యభినయ క్రమమువలె తత్సందర్భానుగుణమైన యామె హావభావముల నవయవ వ్యాపారములంగూడ వర్ణించి యామెను, నామె చేష్టలను గన్నులకుం గట్టినట్లు చేసి, యామె భావోద్రేకములందు పాఠకులఁగూడఁ బాల్గొనునట్లొనర్చి, తన్మయముఁ బొందించి, విగళిత వేద్యాంతరమైన బ్రహ్మానందమును బొందు నట్లు చేసినాఁడు. ద్రౌపది 'బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మ నవిడ్చుట, వెంద్రుకలు దా వలచేతఁబూనుట, భావోద్రిక్తయై దిగ్గనలేచుట, వెంద్రుకలు గోవిందు ముందు పెట్టుట' మొదలగు తద్రసోచితమైన చేష్టలును, 'మనంబునఁబొంగు విషాదరోషములు గావఁగలేక బాష్పములు గ్రమ్మట' మొదలైన తత్సమయ సముచితావేశోద్రేకములును, 'కులాంగన నిట్లొనర్తురే? ముకుంద యదియుందలంపవే? మాధవా నిశ్చయింపుమా! దలఁపవలయు నచ్యుత పీనికి, కొల్ప నే కానఁబడయ మైతిమేని గృష్ణ!, అరుచెన్నడుం బుట్టదచ్యుతా?' అను

ప్రశ్నించుధోరణి వినయపూర్వకముగ వేసుకొనుచు దన భావములలోఁ గొను వక్తృత్వ లక్షణములను సక్రమముగ నిర్దేశించుట కళానైపుణ్యము. దుస్ససేనుని తను 'వింతలింతల'ని చెప్పినపుడు చిన్నచిన్న తునకలని వ్రేళ్ళతోఁ జూపి భావ ప్రకటనము సేయుట మాఁనవస్వభావము. తిక్కన యిట్టి చేష్టలు సూచించినాఁడు. ఈ సన్నివేశము పాఠకుల భావ వీధియందు ఛాయాచిత్రమువలె సుముద్రితమై యుండును. ఇందలి ద్రౌపదీ వక్తృత్వమునకును షేక్స్పియరు యొక్క జూలియస్ సీజరు నాటకమందలి యాంటొనీ వక్తృత్వమునకు సామ్యముండునా? ఇది తిక్కనార్యుని కళ. ఇందు తిక్కన దీర్ఘసమాసముల వాడినాఁడా! సంస్కృత భూయిష్ఠరచనసుఁ జేసినాఁడా! మహావాక్యముల నుపయోగించినాఁడా! గాంభీర్యముతో సకల భావములను గ్రోడీకరించి యేకముఖంబున వెలార్చినాఁడా! కాదు. ఒక భావమైన తరువాత మఱియొక యున్నతభావము నారోహణక్రమమునఁ బ్రవేశపెట్టి, యెదుటనున్న వ్యక్తిమనోస్థితి కుచితమైనగతి వ్యక్తీకరింపఁ జేసినాఁడు. సమాసరహిత వ్యస్త పదములతోఁ జిన్న చిన్న వాక్యములతోఁ దేట తెలుఁగు మాటలతో, 'శుద్ధాంధ్రదేశీయ శబ్దములకుఁగూడ నిట్టి భావోద్రేకమును వ్యక్తీకరింపజాలు శక్తిగలదా' యనియాశ్చర్యపడు రీతి వర్ణించినాఁడు.

'ఈ వెండ్రుకలు పట్టి యీడ్చిన యా చేయి
తొలుతగాఁ బోరిలో దుస్ససేను

తను వింతలింతలు తునియలై చెదరి నూ
పఱియున్నగని యుడు కాఱుగాక'.

అను దానియందలి భావోద్రేక మెంతతీక్ష్ణమైనదో, శైలి సరళత యెట్టిదో? యుపయుక్త దేశీయ పదజాలమెట్టిదో, స్పష్టముకదా! ఇట్టి రచనముందు శ్లేషలు, నుత్ప్రేక్షలు, నతిశయోక్తులు దిగ దుడుపు. ఇట్టి యుద్రేకపూరిత సందర్భమందుఁగూడ 'అసితచ్ఛవి దొల్చు మహా భుజంగమోనా విలసిల్లి వ్రేలఁగ', 'ఆయాసలు మానిచిత్రముల యాకృతినున్నయెడ' యని రెండుమారు లుప మాలంకారము వాడి తిక్కనకవి తత్సందర్భములకు మెఱుఁగు పెట్టినాడు. ఇందాదర్శప్రాయమైన స్త్రీజనావమానజనిత రోషో ద్రేకావస్థనుకవి విశ్వజనీనముగ నుండునట్లనుకరించినాఁడు. గాంభీ ర్యముచే మితభావవ్యక్తీకరణముగాని, భావలోలతచే నతిభావ ప్రకటనముగాని చేయలేదు. ఇట్టికవితాశిల్పము కత్తిమీఁది సామువంటిది. భావవ్యక్తీకరణ మెక్కువైనను దక్కువైననుఁ గూడ రసాభాసమగును. షేక్స్పియరు, తిక్కనకాళిదాసాదు లిట్టి యసిధారావ్రతచర్య సల్పియే కవితాశిల్పమున పట్టభద్రు లైరి. ఇట్టి కవిత్వకళయందు మాత్రము నన్నయ పూర్ణముగా సిద్ధహస్తుఁడు గాలేదని నా భావముగాని యతఁడుత్కృష్ట కవి కాఁడనికాదు.

ఇతర లలితకళలందువలె కవిత్వమందనేక తరగతులు గలవు. భావనాగమ్యమై వస్తుసాక్షాత్కార మూలమున నా నందింపఁజేసి, పాఠకుల హృదయమును ద్రవింపఁజేయునది యద్వితీయమైన కవిత్వము. ఈ విధ కవిత్వమునువిని 'యాహా'

యని యానందించి తన్మయమును బొందుదుము. మితభావ వ్యక్తీకరణచే హృదయమును వికసింపఁజేయునది ద్వితీయ విధము. బుద్ధిగమ్యమై, యర్థచమత్కారముచే మనస్సును జలింపజేయు చిత్రకవిత్వము తరువాతిది. ఇట్టి కవిత్వము నాలకించి 'యోహో'యని యాశ్చర్యపడి మెచ్చుకొందుము. ఇఁకమిగిలి నవి మిగిలిన తరగతికిఁ జెందును. ఇందు తిక్కనార్యుని కవిత్వ మద్వితీయమైనదని, నన్నయ కవిత ద్వితీయస్థానమునకుఁ జెందు నని భావము.

ఉ॥ సారమతింగవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసిమేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు దెనుంగున న్మహా
భారత సంహితా రచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్॥

అని నన్నయ రచించియుండుటచేఁ గవిత్వమున నాతఁ డాశించిన 'అక్షరరమ్యత, 'ప్రసన్నకథాకలితార్థయుక్తి' యను రెండు సిద్ధులే కాని యింకేమియుఁగోరలేదు. ఇందు మొదటిది సంస్కృత వ్యాకరణ పండితుల సంతృప్తి పఱచుటకును, రెండవది సత్కవుల మెప్పుబడయుటకును. సంస్కృతాక్షర రమ్యత నన్నయ కవితాశైలి యందెట్లు నిండి యుండెనో మనము వెనుకనే గమనించితిమి. దానివలెనే ప్రసన్నకథాకలితార్థయుక్తియు నన్నయ కవిత్వమందంతటను నిండియుండి భారతమును మహోత్కృష్ట కావ్యముగఁజేసినది. నన్నయ కవిత్వమునకు నిరుపమాన గౌరవముఁదెచ్చి పెట్టినదీ లక్షణమే. దీని మూలముననే కవులందఱు భారత కవిత్వమును విని 'భళి' యని తలలూచిరి.

ఈ గుణమున కక్షర రమ్యతతోఁ దైన నన్నయకుఁగామితసిద్ధి నొసం గినది. ఈ యక్షర రమ్యతఁగాంచి యితరులనఁగా సంస్కృత వ్యాకరణ పండితులందఱు మోదమంది 'ఓహో' యని మెచ్చుకొనిరి. కాన నన్నయ యాసించిన కవితా విషయద్వయ మందుఁ బరిపూర్ణ ఫలసిద్ధిఁ గాంచినాఁడు. అతఁడాశింపని దాని యందతఁడు సిద్ధహస్తుఁడు గా లేదని చెప్పినఁ బ్రయోజనము లేదు. ఇఁక నన్నయ శిల్పదృష్టితోఁ కవిత్వముఁ జెప్పక పోవుట యతనిశక్తి లోపము గాదు కాని యతని కవితాదృష్టి భేదము.)

కళాదృష్టితోఁగవిత్వము రచించు కవి లోకవ్యవహార ములఁబూర్తిగా గ్రహించి, జగత్తులోని సమస్త చరాచరవస్తువు లందు సానుభూతిఁగనఁబఱచు సహృదయముగల వాఁడై యుండ వలెను. నన్నయకిట్టి లోకవ్యవహారదృష్టియు సహృదయ త్వమును లేకపోలేదు కాని తక్కువ. ప్రత్యక్ష స్వానుభవ మును కొఱతయే. ఇతఁడు పూర్వమీమాంస మతావలంబియై నిత్యము త్రికాలములందగ్నిహోత్రాది కర్మలంజేయు ప్రవరా ఖ్యునివంటి నైష్ఠికుఁడైన కర్మఠుఁడగుటచే, నితనికి యజ్ఞయాగాది కర్మల యందున్నంత యభిలాష యితర లోకవ్యవహారములందు లేదు. కాన నీ విశిష్టలక్షణముతోఁగూడిన యాత్మీయ తయే తనకావ్యమునఁ బ్రతిబింబించి కవితాశిల్ప నిర్మాణము నందతని సిద్ధహస్తునిఁగావింపలేక పోయినది. వైదికక్రియలైన యజ్ఞయాగాదులను, సనాతన మతాచారములను వర్ణించు నప్పుడు మాత్రము నన్నయ పారవశ్యముఁ జెంది సహజోత్సాహ ముతో రచించుటకుఁ గారణ మావ్యక్తిగత విశిష్ట లక్షణమే.

ఒకప్పుడు మూలములో లేకపోయినను నాయా సందర్భములం దవకాశముఁ గల్పించుకొని యాకర్మల నతిశ్రద్ధతో వర్ణించును. తిక్కనకు యుద్ధాదివర్ణనా సందర్భములందువలె నన్నయకు వైదిక కర్మ వర్ణనా సందర్భములం దుత్సాహము పెఱుగును. అగ్నియాత్మ సంహారముఁగావించి నపుడు,

సీ॥ త్రేతాగ్ను లెల్లను దేజరిల్లమిఁజేసి
క్రతుకృత్యములు వినిర్గతములయ్యె,
నగ్నిహోత్రములందు నౌపాసనాది సా
యంప్రాతరాహుతు లంతనుడిఁగె,
దేవతార్చనలందు దీపధూపాది స
ద్విధులు వర్తిల్లక విరతిఁబొందెఁ,
బితృకార్యములఁ బితృపిండ యజ్ఞక్రియ
లడఁగె విచ్ఛిన్నంబులై ధరిత్రి॥

మఱియు రురుఁడు సర్పదష్టయైన ప్రమద్వర కొఱకై దుఃఖించుచు

చ॥ అలయక యేను దేవయజనాధ్యయన వ్రతపుణ్యకర్మముల్
సలుపుదునేని, నేను గురు సద్ద్విజ భక్తుఁడనేని నేన య
త్యలఘుతపస్వినేని, దివిజాధిప భూసురులార, మన్మనో
నిలయకు నీప్రమద్వరకు నిర్విషమయ్యెడు నేఁడుమీఁదయన్॥

ఇట్టి వనేకము నన్నయభారతము నందంతటను వ్యాపించియున్నవి. నన్నయతాను లోకజ్ఞుఁడని చెప్పికొనినను మొత్తము మీఁద నీతనిది వైదికదృష్టి గాని లౌకికదృష్టిగాదు. అందుచేతనే ద్రౌపదిపాత్ర పోషణము వేదకాలమునాఁటి బ్రాహ్మణ స్త్రీవలె నుండుట.

ఆంధ్రులనుజాతి యైతరేయబ్రాహ్మణ కాలమునాఁటికే యున్నదని తెలియుచున్నది కాని వారే భాషను మాటాడెడి వారో, వారి నాగరికత యెట్టిదో, వారేదేశముల నివసించెడి వారో, వారి విజ్ఞాన మెట్టిదో సుస్పష్టముగఁ దెలియదు. ఈ దుస్థితి సుమారు పదునొకండవ శతాబ్దాది వఱకుండెను. వాఙ్మయము లేని జాతి యనాగరిక జాతియనఁబడును. నన్నయ కాలమువఱ కాంధ్రులకు సారస్వతమున్నట్లు గనఁబడదు. ఆ లోపమును నన్నయ దన భారతరచన మూలమునఁ దీసివేసి నాఁడు. ఆంధ్రులకు జాతిత్వము, నాగరికత, వాఙ్మయము, విజ్ఞానముఁ గూర్చినవాఁడు నన్నయ. సంస్కృత ప్రాకృత ద్రావి డాది శబ్దముల నాంధ్రవాణి కుపయుక్త మగునట్లు మనోరంజక ముగ సంస్కరించి, 'దేశభాషలందుఁ దెలుఁగులెస్స' యని నుతింపఁబడునట్లు శబ్దమాధుర్యముఁగూర్చి, యాంధ్రభాషకు వాఙ్మయమునకు స్వరూపమునొసఁగి, లోకభాషలలో నాంధ్ర మున కొక స్థానముఁగలుగఁ జేసినవాఁడు నన్నయ. నన్నయ లేకయున్న నాంధ్రభాషావాఙ్మయములు లేనట్లే. పూర్వ శాసనములందలి మోటైన పద్యపదముల వైఖరిని వంకలు దీర్చి సంస్కరించి మోహనమూర్తిగఁ దెలుఁగుముద్దియను జేయుటచే శబ్దానుశాసనుఁడును, వాగనుశాసనుఁడునయ్యె నన్నయ. మహాంధకారముననున్న యాంధ్రవాణికి, నాంధ్రకావ్య ప్రపం చమునకు సుశబ్ద ప్రయోగముచేతను, మనోహర కావ్యరచన చేతను మార్గము దీసి యంధకారము వాపినవాఁడు నన్నయ. ఆంధ్రకావ్య ప్రపంచమున కాదిభిక్షఁబెట్టినవాఁడు నన్నయ.

అందుచేతనే కవిబ్రహ్మయైన తిక్కన నన్నయను 'విద్యాదయితుం'డ 'ని వాడినాఁడు. ఆంధ్రకావ్య విద్య కీతఁడు గురువు.

ఆంధ్రవాఙ్మయము మొగ్గదొడిగిన తోడనే పరిమళము దశదిశల వ్యాపించుటకుఁగారణ మాకవిశ్రేష్ఠుని ప్రతిభావిశేషమే. నన్నయ కేవలము కవిమాత్రుఁడు గాఁడు. ఈతఁడు నిశితమైన బుద్ధియు, నసాధారణమైన ప్రజ్ఞయుఁ గలనాఁడనుట కాతని భారత కవితారచనయే యన్ని విధముల సాక్ష్యమిచ్చుచున్నది. అందుచేతనే యతఁడు తన్ను 'సత్యమరాధిపాచార్యుఁడ 'ని విద్వత్సభలో మహారాజునెదుటఁ జెప్పుకొనఁ గల్గినాఁడు. వాఙ్మయోదయముగాని భాషయందొక్క మాఱుఁగ నిట్టి మహోత్కృష్ట కవిత్వముఁ బుట్టించుట కవిసామాన్యునకు సాధ్యమగు పనిగాదు. నన్నయార్యుఁడు విద్యాసంపత్తియు, మేధాసంపత్తియు సంపూర్ణముగఁ గలిగిన నిరుపమాన స్థితప్రజ్ఞుఁడగు కవివీరుఁడగుటచే సంస్కృతధోరణి నాంధ్రకవిత్వరచనఁ గావించి యాంధ్రకావ్య సృష్టికర్తయయ్యెను. ప్రథమాంధ్రకావ్యమిట్టి నిరుపమాన ప్రతిభాశాలి చేతిలోఁబడుట చేతనే యట్టి కట్టుదిట్టములతో రచింపఁబడి మహోత్కృష్ట కవితగల యుద్గ్రంథమైనది. నన్నయకుఁ బూర్వమాంధ్రమున కావ్యరచన లేకపోయినను నిట్టి రసవత్కావ్యము నొక్కమాఱుగ నుదయింపఁజేసి యాశ్చర్యముఁగలుగఁ జేయుట కాతని యాశ్చర్యకరాసదృశప్రతిభాశక్తియే కారణము.

సంస్కృతమున వాల్మీకి యెట్టి యాదికవియో యాంధ్రమున నన్నయ యట్టి యాదికవియని యనేక ప్రాచీనాంధ్రకవులు

దమ కావ్యారంభములందు సుకవిస్తుతులలో నుతించిరి. తిక్కన మెట్టిన శ్రీనాథ పెద్దనాదులందఱు కీతఁడు పూజార్హుఁడు. రాము రాజభూషణుఁడు 'ముహిం మార్గ వాగనుశాసనుండు సృజయింప'నని నన్నయ నాంధ్రవాఙ్మయ స్రష్టనుగా వర్ణించినాఁడు. ఆంధ్రభారతము సర్వాంగసుందరమై, సర్వ దిక్కుల పరిమళించి సర్వజనామోదముఁ బడసి నన్నయార్యుని ధన్యుని జేసినది. నన్నయభారత మాతనికాలమందు మాత్రమే కాక యాంధ్రభాష జీవించియుండు నంతవఱకు గౌరవస్థానముఁ బొందునట్లుగ రచింపఁబడి సర్వకాలములందు విద్వత్కవులచే శిరసావహింపఁ బడుచున్నది. దాని గౌరవస్థానమునకు మార్పులేదు. ఆంధ్రమున నన్నయ ప్రయోగించిన శబ్దములే ప్రమాణములనియు తద్విరుద్ధములు పండితాంగీకారము వడయవనియు దాక్షారామవాటి కవిరాక్షసుఁడు చెప్పెనని యప్పకవి దన యప్పకవీయమున రచించెను. ఆంధ్రవాఙ్మయమున నన్నయయందుఁ గల ప్రామాణ్యమట్టిది.

నన్నయభట్టు భారతమున నించుమించుగా సగము వచనము వ్రాసెను. ఈతని వచనమందవయవ వాక్యగర్భితమైన మహావాక్యము లధికముగానుండును. అవి కమ్మచ్చులోఁ దీసిన తీఁగెవలె నొక్క తీరుగ నుండి శిష్టుల భాషవలె నుండును గాని ప్రయత్నపూర్వకముగ వ్రాసినట్లుండవు. ఇతని పద్యశైలివలెనే వచనశైలి సుబోధకమై యుండును. కథనడుపునపుడును, కథల యాద్యంతములఁ దెలుపునపుడును, చిన్నచిన్న సంభాషణలందును, వర్ణనలందును, శాస్త్రీయ ప్రసంగము

లందును నన్నయ వచనముల వాడును. ఈ వచనములందుఁ గంటెఁ బ్రకృతివర్ణనలఁ జేసిన వచనములందు శబ్దజటిలత యెక్కువగా నుండును. ఈతని వచనములందర్థపుష్టియు, మృదుత్వము ను గలిసియున్నవి.

నన్నయకుఁబూర్వము శాసనాదులందు సీసము, మధ్యాక్కర, తరువోజ ద్విపద మొదలైన దేశీయ వృత్తములలో నాంధ్రపద్య రచన ముండెను గాని చంపక శార్దూలాది వృత్తములలో లేదు. కర్ణాటకవులు నన్నయకుముందే సంస్కృత వృత్తములలో కావ్యముల రచించిరి. ఆ మార్గముననే నన్నయ గూడ నారాయణభట్టు సాయముతో భారతమున సంస్కృత వృత్తములఁ బ్రయోగించి వానితోఁబాటు దేశీయ వృత్తములఁగూడ వాడినాఁడు. సంస్కృత వృత్తముల నాంధ్రమునఁ బ్రవేశపెట్టుటలో కన్నడకవుల ననుకరించెను. వస్తులాలిత్యము గలచోట్ల చంపకోత్పల మాలలను, గాంభీర్యము పట్ల శార్దూల మత్తేభముల వాడఁదగి యున్నను నన్నయభట్టట్లు సేయక నాలుగు వృత్తములఁగూడ వస్తుగాంభీర్యము గల స్థలముల వాడెను. కథను నడుపుటకును వర్ణనలకును సీసమును, ఋతు వర్ణనలందు లయగ్రాహియు, నీతిని బోధించు సందర్భముల కందము నుపయోగించెను.

భారతమందు నన్నయ సీసముల నొకనియమముతో రచించెను. ప్రాసయతితో సీసమును బ్రారంభించినఁ బద్యమంతయుఁ బ్రాసయతితోడనే వ్రాయును. ఒకప్పుడు పద్యమంతయు నేకాక్షర ప్రాసతోఁగూర్చును. దీనికే భీమన దన

కవి జనాశ్రయమం ‘దక్కిలి ప్రాససీస’ మని పేరుఁబెట్టెను. మఱియొకప్పుడితఁ డొక్కొక సీసపాదమున కొక్కొక్క ప్రాసాక్షరమును మార్చుచుండును. దీనిని భీమన ‘యవకలి సీస’ మనెను. నన్నయ యతితో సీసపద్యము నారంభించిన చివరవఱకు యతితోడనే వ్రాయునుగాని, మధ్యప్రాస యతినివాడి మిశ్రమముగా నితరకవులవలె వ్రాయఁడు. పద్యమునందంతట నేకాక్షరమును యతిగాఁగూడ నితఁడుపయోగించును. దీనిని ‘వడిసీస’ మందురు. మఱియొకప్పు డేపాదమున కాయక్షరమును యతికై మార్చుచుండును. దీనికి భీమన ‘యక్కిలివడిసీస’ మనిపేరిడెను. ఈవిధముగ నన్నయ నాలుగు విధములైన సీసముల నియమముతో వ్రాసినాఁడు. సీసపద్యము నిట్టినియమముతో రచించుట నన్నయ పూర్వకాలమందున్న చాళుక్య మహారాజు శాసనమునను, దీర్ఘాసిశాసనమందుఁగూడఁ బాటింపఁబడుటచే నిది ప్రాచీనాచారముగ నున్నది. కాని నన్నయ తరువాత కవులందీ నియమము సన్నగిలి యథేచ్ఛముగా నుపయోగింపఁబడినది.

అప్పకవి మధ్యాక్కరకు రెండింద్ర గణములు, నొకసూర్య గణము, మరల రెండింద్రగణములు, నొక సూర్యగణమునుండి నాల్గవగణ ప్రథమాక్షరము యతి స్థానమని తెలిపెను. కాని నన్నయ మధ్యాక్కరలును, యుద్ధమల్లుని శిలాశాసనమందలి మధ్యాక్కరలు నీవిషయమున భేదము గలిగియున్నవి. వీని యందు యతిస్థానమైదవగణ ప్రథమాక్షరముగ నున్నది. ఇది యుఁగాక గణముల విషయమందుగూడ నన్నయ మధ్యాక్కర

లప్పకవి లక్షణముతో సరిపోకున్నవి. అజ్ఞత చేఁగొందఱు నన్నయ మధ్యాక్కరలను మార్చి యప్పకవి లక్షణమునకు సరిపోవునట్లు దిద్దిరి. కాని కర్ణాట మధ్యాక్కర లక్షణముతో సమన్వయించిన నన్నయ మధ్యాక్కరలు నిర్దోషముగాఁ గనఁబడు చున్నవి. కర్ణాట ఛ్ఛందములో బ్రహ్మ విష్ణు రుద్రగణములని త్రివిధము. అందు బ్రహ్మగణములు గగ, స, గల, న, గణములును, విష్ణుగణములు నల, గన, సల, భ, ర, త, మ, సగ, గణములునై యున్నవి. కర్ణాట లక్షణము ప్రకారము మధ్యాక్కరకు (దొరెయక్కరకు) రెండువిష్ణు గణములు, నొక బ్రహ్మగణము, మరల రెండు విష్ణుగణములు నొక బ్రహ్మగణము నుండును. కాని నన్నయ దన మధ్యాక్కరలందుఁ గొంతమార్పుఁ జేసెను. కర్ణాటయక్కరలలో నైదు మాత్రలకు మించిన విష్ణు గణములు వాడఁబడలేదు. నన్నయ యాఱు మాత్రల గణములఁగూడ వాడి నాఁడు. ఎఱ్ఱాప్రెగ్గడ తరువాతనాంధ్ర కావ్యములలో మధ్యాక్కరల నెవరు నెక్కువగా వాడలేదు. ఎఱ్ఱాప్రగ్గడ మధ్యాక్కరలందు యతిస్థానము నాల్గవ గణ ప్రథమాక్షరముగ నున్నది. ఈ విషయమున నెఱ్ఱాప్రగ్గడ కంటె నన్నయకే యెక్కువ ప్రామాణ్యము నియ్యవలసి యుండును. ఎఱ్ఱాప్రెగ్గడాద్యర్వాచీనకవులచే వ్రాయఁబడిన మధ్యాక్కర లప్పకవి లక్షణమునకు సరిపోవుచున్నవి.

నన్నయకవిత యారణ్యపర్వ చతుర్థాశ్వాసమందలి

ఉ॥ శారదరాత్రు లుజ్వల లసత్తర తారక హారపఙ్క్తులం
జారుతరంబులయ్యె వికసన్నవ కైరవ గంధబంధురో

దారసమీర సౌరభముదాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండురుచిపూరము లంబర పూరితంబులై

అను పద్యముతో నకస్మాత్తుగా నాగి పోవుటచే భీమనాధర్వ ణుల శాప మూలమున మతిభ్రష్టుఁడై మరణించెనని యనేక విధములుగా నూహించి కల్పించిన కథలు తలయుఁదోఁక లేనివి. వారు నన్నయ సమకాలికులు గారని పూర్వమే స్పష్టపడినది. మఱియు రాజనరేంద్ర నకు సారంగధరుఁడను కుమారుఁడున్నట్లు చరిత్రయందెక్కడఁ జెప్పఁబడలేదు. బహు కాలమునుండి పరిశోధనలు జరుగుచున్నను చారిత్రిక ప్రామాణ్యములేని రాజనరేంద్ర సారంగధర చిత్రాంగులకథకుఁ బ్రాధాన్యమిచ్చి యాంధ్రవాఙ్మయోద్ధారకులైన రాజనరేంద్ర నన్నయభట్టుల కీర్తినిఁ గళంకము పాలుసేయుట యాంధ్రజాతికి నాంధ్రవాఙ్మయమునకుఁ గళంకముఁగూర్చుటేగాని మఱియొకటికాదు. విశేషించి నైష్ఠికుఁడు, పవిత్రుఁడు, సుజనుఁడు, నిత్యసత్యవచనుఁడు నగు నన్నయ యసూయతో భీమనాధర్వణుల గ్రంథముల నాశనము సేసెననుటయు విశ్వాసార్హముగాదు. భారతమును నన్నయ మధ్యనే విడిచిపెట్టుటకు రాజనరేంద్రుని మరణమే కారణమగును. కాన భారతాంధ్రీకరణము రాజనరేంద్రుఁడు శత్రువుల జయించి దేశమున శాంతి నెలకొల్పినతరువాత ననఁగా నతనిరాజ్య పరిపాలనావసానకాలమందుఁ బ్రారంభింపఁబడి యుండును. అట్లురాజనరేంద్రుఁడు జీవించియుండఁగనే నన్నయ మతి భ్రమణముగాని మరణముగాని జరిగి యుండినచో భారతాంధ్రీకర ణమందు విశేషాభి మానముగల రాజరాజు నారాయణభట్టా

దులచే భారతమును బూర్తిఁ జేయింపకుండునా? రాజనరేంద్రుని మరణానంతరము వేఁగిదేశ మల్లకల్లోలముగానుండి యరాజకమై యేడు సంవత్సరములవఱకు నతనికుమారుఁడగు రాజేంద్ర చోళుఁడు సింహాసనమునకు రాకపోవుటయు, నాతరువాతఁగూడఁ గుళోత్తుంగుఁడు మాతామహులదైన చోళరాజ్యముపై శ్రద్ధ వహించి చాళుక్యరాజ్యముపై ననాదరము సూపుటవలనను, భారతాంధ్రీకరణమునకు సమ్మతింపని పండితులు నూత్నరాజును వశముచేసికొని యతని మతిని ద్రిప్పుటవలనను, నారాజు కావ్యగీతి ప్రియుఁడుగాక పోవుటవలనను రాజాదరములేక పోయెను. కులోత్తుంగుని తరువాతఁగూడ వేఁగిదేశమున స్వల్ప కాలములో ననేక రాజులు మాఱుచుండిరి. ఈ కాలమున దక్షిణ హిందూదేశమున మహారాష్ట్ర కర్ణాట ద్రావిడాంధ్ర కళింగు లేకచ్ఛత్రాధిపత్యము వహింపవలెనని పట్టుదలతో వీరాధివీరులై పోరుచుండిరి. మండలేశ్వరులు పౌరుషవంతులుగాఁ జొచ్చి రాజ్యసంపాదనకై పెద్దరాజులపైఁ దిరుగుఁబాటు చేయుచుండిరి. ఇఁక కొలఁది కాలముననే రామానుజాచార్యులొక మూలను బసవనాయలు మఱియొకదిక్కున నుద్భవించి భక్తి ప్రధానమైన వీరవైష్ణవ వీరశైవ మతముల ప్రతిపాదించి వ్యాపింపఁజేయుటవలన జనులకుఁ గ్రమముగా వైదికమతముపై నాదరము దగ్గుటచేతను, బసవేశ్వరుని మూలమున దేశము ఘోరమైన మతయుద్ధములలో మునిఁగియుండుటచేతను, నన్నయ ప్రారంభించిన భారతాంధ్రీకరణముఁ బూరించువారు లేక రెండు వందల సంవత్సరముల వఱకు మూలఁబడి యుండెను.

# సభాపర్వము

మహాభారతమందలి పర్వములలోఁ గొన్ని పెద్దభాగమును మఱికొన్ని చిన్నభాగము నాక్రమించి తదుచిత రీతిఁ బ్రాముఖ్యము గలిగియున్నవి. అట్టివానిలో సభాపర్వమునకు భారతమునందుఁగల స్థానమెట్టిదని విచారింపఁగ నది చిన్న పర్వములలో నొకటైనను భారతకథయందు సభాపర్వకథ ముఖ్యస్థానము వహించిన దని గోచరించుచున్నది. ఆంధ్రభారతమందలి సభాపర్వమునందుఁగల రెండాశ్వాసములలోఁ బ్రథమాశ్వాసమందు మయుఁడు దన కృతజ్ఞతను సూచించుచు ధర్మజున కొక యపూర్వసభను నిర్మించి యిచ్చుటయు, ద్వితీయాశ్వాసమందు హస్తినాపురమునఁ బాండవ కౌరవులకు ద్యూతము జరుగుట యను విషయములు మాత్రముగలవు. పై విషయములకు సభాపర్వపూర్వోత్తర భాగములందుగల భారతకథకుఁగల సంబంధమెట్టిదని విచారించిన భారతకథయంతయు సభాపర్వకథపై నాధారపడియున్నదని గ్రహింప గలము.

సభాపర్వ కథాకాలమునకుఁ బూర్వము పాండవధార్తరాష్ట్రులకుఁ బరస్పర ద్వేషము మనంబులందంతర్గతమైయున్నను బైట కొకరికొకరు వెలిపఱుపలేదు. సామాన్యముగాఁ బ్రతి గృహమునందిరుగు పొరుగువారికి ద్వేషములు బాలుర మూలముననే బయలుదేరును. ఆ బాలుర కాటల యందసూయ జనించి క్రమమున వైరముగాఁ బరిణమించును. అట్లే పాండుసుతులకు ధృతరాష్ట్రసుతులకు వైర ముద్భవించినది. బాలురైన పాండవధార్తరాష్ట్రు లాటలాడువేళ బలిష్ఠుఁడైన భీముఁడు,

సీ॥ కూడిజలక్రీడ లాడుచోఁ గడఁగి యా
ధృతరాష్ట్రతనయుల నతులశక్తి
లెక్కించియుఁ బదుండ్ర నొక్కొక్కభుజమున
నెక్కించుకొని వారి యుక్కడంగఁ
గొంచక నీరిలో ముంచుచు నెత్తుచుఁ
గారించి తీరంబుఁ జేరఁబెట్టు,
కోరి ఫలార్థులై వారల నెక్కిన
భ్రమాఁకుల మొదళ్లుల వీఁకఁబట్టి

ఆ॥ వడి గదల్చుఁ బండ్లు దడంబడి వారల
తోన ధరణిమీఁదఁ దొరఁగుచుండ
నిట్టిపాట గాడ్పుపట్టిచే దుశ్శాస
నాదులెల్ల బాధితాత్ములైరి॥ ఆది. V. 166.

బాల్యదశయందు దుర్యోధనుండు భీముని బలపరాక్రమముల కసూయఁజెందిన వాఁడై యతని నీటఁద్రోయించుట, పాములఁ గఱపించుట మొదలైనవి తాను జేయించె ననునట్లు దెలియకుండ రహస్యముగఁ జేయించెను. దైవవశమున నవి యన్నియు దుర్యోధనాభిప్రాయమునకుఁ బ్రతికూలముగఁ బరిణమించినవి. అందుచేఁ బాండవులపైన యసూయయు, వారివలన భయము నతని కధికమైనవి. విద్యాభ్యాసకాలమందు సహాధ్యాయులకుఁ బరస్పరాసూయాద్వేషములు ప్రబలుట మనము సాధారణముగఁ గనుగొనుచుందుము. అట్లే పాండుధృతరాష్ట్రకుమారులకు సంభవించినది. పూర్వమే వారికిఁ బరస్పరవైరవ ముద్భవించి యుండుటచే దాని కిపుడు దోహదము గల్గినది. కుమా

రాస్త్రప్రదర్శనమందుఁ బాండవులపై దుర్యోధనునకుఁ గల యసూయ తెరమాటుగ వ్యక్తీకరింపఁబడినది. అపుడు కర్ణుఁడు వీనికి సాయమైనాఁడు. అంత దుర్యోధనునకు మనమున ధైర్యము హెచ్చినది.

క॥ వినుత ధనుర్విద్యావిదు
ఘనుఁ గర్ణుసహాయుఁ బడసి కౌరవవిభుఁడ
ర్జును వలన భయముచెడి, యొ
మ్మనఁ జేయిడి నిద్రవోయె ముదితాత్ముండై.॥

ఇంతటితో దుష్టచతుష్టయము పూర్తియైనది. ఇఁక నుండి వీరు పాండవ నాశనోపాయమునకై బహురహస్యముగాను దీర్ఘముగా నాలోచించుచుండిరి. పాండవ లాక్షాగృహదహనము దీనిపర్యవసానము. కాని పాండవులు దీని నంతయుఁ బూర్తిగ నెఱింగియు నేమియు నెఱుఁగని వారివలెఁ బ్రవర్తించిరి. తరువాత ద్రుపదుని పురమున వీరు సజీవులై యుండిరని ధార్తరాష్ట్రులు గనుంగొనిరి. అటు విశేషించి పాండవులు ద్రౌపదీ స్వయంవరమునఁ బరరాజుల గెలిచి వెలందిని పరిణయమైరను వార్త నెఱిఁగి వెన్ను విఱిగి వారు పొందిన యసూయకు మేఱలేదు. పాండవులు బ్రతికి యుండిరని యెఱింగి సంతసించినాఁడు ధృతరాష్ట్రుఁడు. పూర్వము,

క॥ తనసుతులు పాండుసుతులని
మనమున భేదింప కతిసమంజసభావం
బున నొక్కరూపకాఁ జే
కొనియుండెం బాండురాజు కొడుకులఁ బ్రీతిన్॥

కాన నిపుడు వారిఁ బిలిపించి యర్ధరాజ్యంబిచ్చి యింద్రప్రస్థ పురంబున నుంచె అందుచేఁ బాండవధార్తరాష్ట్రులకుఁ దాత్కాలిక మశ్శాంతి గుదిరినది. ఇంతవఱకు జరిపిన దుర్యోధనుని దౌష్ట్యము ధృతరాష్ట్రునకుఁ దెలియదు. కాని ధార్తరాష్ట్రులకుఁ బాండవులపైఁగల యసూయాద్వేషము లింతటితో ముగియునవి కావు. కుండకు మాటువేసినంత మాత్రమున నది స్థిరముగ నుండజాలదు; యేదో యొక కాలమున జలపూరితంబైన తటిఁ బగిలి జలముచింది భగ్నమనోరథులఁ గావించవలసినదే. అట్లే ధార్తరాష్ట్రుల యంతర్ద్వేష మేదో యొక కాలమున బహిర్గతము గాకుండ నుండఁజాలదు. ఇది మానవ ప్రకృతి తత్వము. కాని యెవరును ముందు తొందరపడుట లేదు; దీనికిఁ దగిన పరిస్థితు లేర్పడవలెను.

రాజసూయాధ్వర మొనర్పక పూర్వము పాండవులు సామంతరాజులవలె సామాన్య ప్రభువులేకాని సార్వభౌములు గాదు. వీరికంటె బలాఢ్యులు జరాసంధాదులు బలువురు గలరు. కాని వీరు దేవాంశ సంభూతులగుటఁ జేసియు, శ్రీకృష్ణుని సాయము వీరికుండుటఁజేసియుఁ, బాండవు లైదుగురకేకీభావముండుటఁజేసియు, సార్వభౌములుగాఁ దగినంతటి యవకాశమున్నది. అట్టి సమయమునఁ బితృలోకమందున్న పాండురాజుయొక్క యభిలాష నెఱవేర్పనెంచిన నారదుఁడు ధర్మరాజునొద్దకు వచ్చి యతని రాజసూయ యాగముఁ జేయుమని వారల ప్రోత్సహించెను. రాజసూయ యాగముసేసి పాండవులు సార్వభౌమ పదమును స్థాపించికొనవచ్చును. దానిఁ

జేయువాఁడు ప్రప్రథమున నానాదేశాధిపతుల జయించి తన యేకచ్ఛత్రాధిపత్యమును స్థాపించికొనవలయును. అందులకై తనకంటె బలాఢ్యులను, తుల్యబలులను జయింపవలెను గానఁ బాండవులు రాజసూయ యాగమునకుఁ బూర్వము బహు బలాధికుఁడైన జరాసంధుని మాయోపాయమునఁ దెగటార్ప వలసి వచ్చెను. ధర్మజుని సోదరచతుష్టయము చతుర్దిశల జయించుటకై యేగినపుడు దేశాధిపతులు కప్పమిచ్చినను గొందఱ మనంబులఁ బాండవులపై ద్వేషము లేకపోలేదు. బల హీనులగుటఁజేసి సామంతరాజు లరి గట్టిరి కాని యహంభావ శూన్యులై కాని భక్తిపూరితులై కాని కాదు. ఇందుచేఁ గొందఱకుఁ బాండవులపై నసూయాద్వేషములు పెఱిగి సమ యము వచ్చినపుడు వారిపైఁ బగదీర్చుకొనుట కెదురుచూచు చుండిరి. ఇందుచేతనే నరకాసురుని కుమారుఁడైన భగ దత్తుఁడు మొదలగువారు భారత యుద్ధమందుఁ గౌరవుల పక్ష మున యుద్ధముసేసిరి. పాండవులు రాజసూయాధ్వరముఁ గావించుట శత్రువుల కసూయా జనకమగుటకు, దాయాదు లకు మాత్సర్యము హెచ్చుటకుఁగారణమయ్యెను. రాజసూయా ధ్వరమునకై సామంత నృపులు దెచ్చిన ధనరాసులఁజూచియు, మయసభఁగాంచియు దుర్యోధనునకు హృదయము చెదరి మనస్సున దురుద్దేశములు ప్రవేశించినవి.

ఇంతవఱకు ధార్తరాష్ట్రులకుఁ బాండవులపైఁగల ద్వేష మంతర్గతమై యుండెనేకాని బహిర్గతము గాలేదు. అది యిట్టి రాజసూయమందుఁగూడ నొకకొఱుగా బహిర్గతమగుటకుఁ

పాండవులు బంధువులును ధర్మమార్గ ప్రవర్తకులుం గానఁ దగిన కారణములు లేకపోయెను. సామాన్యముగా దుష్టులకుఁ దమకంటె నధికమగు పరులధనమును గాని బుద్ధిబలమును గాని బాహుబలమునుగాని పొడగాంచినపు డసహానము బయలుదేఱును. అట్లే పూర్వము దుర్యోధనుఁడు పాండవుల బాహుబలంబుచు గాంచి యసూయఁజెంది యిపుడు వారి ధనముఁగాంచి యీర్ష్యాపూరితమానసుఁ డయ్యెను. కానఁ బాండవుల యైశ్వర్యమును, వారిపరాక్రమమును జూచి యతఁడు మనస్సునఁ గ్రుంగిపోవుచుండెను. ఇట్లెంతకాలముండఁ గలఁడు? శిశుపాలవధ సందర్భమునఁ బాండవుల కపజయము రావలెనని కోరెను. కాని యంతయు వ్యతిరేకముగాఁ బరిణ మించుటచే నూరకుండెను. ఇట్టి యసూయా పూరిత మానసుఁ డైన పరిస్థితులలో దుర్యోధనుఁడు మయసభఁ గాంచి తదీయా పూర్వ రమణీయతకు విస్మయమంది, దానియం దాశిల్పి మహిమవలన వంచనావమానములఁ బొందెను. 'దుర్యోధనుఁడు ...... సంవృతంబైన ద్వారంబు వివృతంబుగా వగచి చొఱం బోయి లలాటఘట్టిత గృహద్వారుండయ్యె.' మఱియు 'స్ఫటికదీప్తిజాలపరివృతంబైన జలాశయంబు స్థలంబుగా వగచి కట్టిన పుట్టంబు దడియంజొచ్చి క్రమ్మరిన వానిఁజూచి పాంచాలియుఁ బాండు కుమారులు నగిరి'. (సభా. II. 26). ఇది దుర్యోధనునకుఁ గోఱుచుట్టుపై రోఁకటిపోటై మర్మభేదముగా నుండెను. ఈ యవమాన ప్రతీకారమునకై యాలోచించుచు లోలో నతఁడు గుమిలిపోవుచుండెను.

కం॥ కంసుగల పసిడిఁ గాఁచిన
కంది వివర్ణమయినట్లు కౌరవుకాయం
బొందఁగ వివర్ణమై కడు
వందె మనస్తాప హవ్యవహదాహమునన్॥ సభా. II. 89.

ఇంతవఱకు నతని కుపాయమేమియుఁ దోఁచలేదు. ఇంతలో రామాయణకథయందుఁ గైకకు మంథర దోడ్పడినట్లు దుర్యోధనునకు శకుని దోడ్పడెను. పాండవుల సంపదలపైఁ దనకుఁగల యసూయయు, సభావమానమును దుర్యోధనుఁడు శకునికిఁ దెలిపెను. వెంటనే వారి నైశ్వర్యముఁ గొనుటకు, వారి నవమానించుట కొక యుపాయము గలదని శకుని దన స్వాధీనమందున్న ద్యూతముఁగూర్చి చెప్పఁగ దీనితో నెంతటి కార్యమైనను సాధింపవచ్చునని దుర్యోధనుఁ డెంచినాఁడు. ధర్మరాజ ద్యూతప్రియత్వముగూడ వారికిఁ దోడ్పడినది. తరువాత నెట్లో దుర్యోధనాదులు ధృతరాష్ట్రు నంగీకారముఁబడసి, పాండవులను హస్తినాపురంబునకు రప్పించి సుహృద్ద్యూత వ్యాజమున మాయాద్యూతమునందుఁ బ్రవేశపెట్టిరి. ఇంత వఱకుఁ బాండవుల నౌరసులవలెఁ జూచుచున్న ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుని మీఁది ప్రేమచే వారల నన్యథా చూచి ధర్మ మార్గమునుండి చ్యుతుఁడయ్యెను. ఇందుచే నితని శీలమందిక్కడ నుండి మార్పు చెందినది.

ద్యూతములోఁ బాండవులు సర్వసంపదలఁ గోల్పోవుటచే వారి నైశ్వర్యము వలనఁ గల్గిన యసూయ నుండి దుర్యోధనుఁడు విముక్తిఁ బొందఁ గిలిగినాఁడు. ఇంతవఱకుఁగూడఁ

పాండవ ధార్తరాష్ట్రుల యంతర్గత ద్వేషము బహిర్గతము గాలేదు. దుర్యోధనుని రెండవకోరిక మిగిలిపోయినది— మయసభావమాన ప్రతీకారము. దీనికి శకునియేమియు సహాయము సేయఁజాలక పోయెను. ఈ ప్రతిక్రియను సాధించుటకు బుద్ధి సూక్ష్మత యెక్కువ యుండవలసి వచ్చుటచే శకునిని మించిన వ్యక్తి మఱియొకఁడు గావలసి వచ్చెను. కౌరవ సభకు బలాత్కారముగఁ దోడ్కొని రాఁబడిన ద్రౌపది యధర్మ విజిత యనిచెప్పిన వికర్ణుని పలుకులఁ బ్రత్యాఖ్యానము సేసి కర్ణుఁ 'డేకవస్త్రయైయున్న దీని సభకుఁదోడ్కొని వచ్చుట ధర్మవుకాదంటివి, భార్యకు దైవవిహితుండైన భర్తయొక్కరుండ, యిది యనేకభర్తృక కావున బంధకి యనంబడు. ఇట్టి దాని విగతవస్త్రంజేసి తెచ్చిన ధర్మవిరోధంబు లే'దని చెప్పి ద్రౌపదీవస్త్రాపహరణముఁ జేయుమని ధార్తరాష్ట్రులకు సూచించెను. వెంటనే దుశ్శాసనుం డగ్రజుచే నాజ్ఞాపితుఁడై ద్రౌపది వలువ లొలిచె. అటుపిమ్మట,

గీ॥ తరుణి యేవురకంటె నొక్కరుఁడు భర్త
యగుట లగ్గు జూదంబున నాలి నోటు
వడనివానిఁగఁ దగుభర్తఁ బడయుమింక
ననుచు రాధేయుఁ డుల్లసమాడె నంత ॥ సభా. II. 146.

ఈ సూచన గ్రహించి వెంటనే దుర్యోధనుఁడు ద్రౌపదిఁ 'దన రమ్య పృథూరుతలంబు నెక్కఁగా రమ్మని సన్నఁజేసె'. ఈ విధముగ దుష్టచతుష్టయము పాపకార్యమున సమాన భాగములఁ బంచుకొని ద్రౌపది నవమానించుటచేఁ గౌరవ వంశ

నాశనమున కిట బీజము నాటఁబడినది. రామాయణమున సీతాపహరణము రావణవంశనాశన మూలకారణం బైనట్లు, ద్రౌపదీ వస్త్రాపహరణము కౌరవవంశ నాశనమునకు మూల కారణమైనది. సీతాపహరణముకంటె ద్రౌపదీ వస్త్రాపహరణ మెక్కువ శోచనీయమైన విషయము. రాక్షసులైన నిట్టి స్త్రీ మాన భంగమును సభలోఁ బూర్వ మెప్పుడుఁ జేసియుండినట్లు మనము వినము. అందును విశేషించి సోదరుల భార్య. మఱియు గురువృద్ధులున్న నిండు సభలోఁ బట్టపగలు. ఇట్టి పాపమునకు క్షమాపణ లేదు. ఈ కార్యముతో దుర్యోధ నుఁడు దన సభాప్రలంభమునకుఁ బ్రతీకారముఁ జేయగల్గితి నని తలఁచినాఁడు గాని దీనితో నతని బ్రతుకుప్రొద్దు వాటారినది. ఇతని పాపములు పండినవి. ఇదియే యితని పతనమునకు మూలకారణము. దీనితోఁ బాండవ ధార్తరాష్ట్రుల యంత ర్ద్వేషము బహిర్గతమైనది. ఇంతవఱకజాతశత్రుఁడు దుర్యోధను నకు ద్యూతమందు సక్రమముగా సకల సంపదల నోటువడెనని తలంచినాఁడు గాని యిపుడు పగసాధించుటకై ధార్తరాష్ట్రు లిట్లు సేసిరని యతనికి స్పష్టపడినది. ఈ వైరమును మొదట బహిర్గతముఁ జేసినవారు ధార్తరాష్ట్రులు. వారు సేసిన పరాభవ మునకు వెంటనే ప్రతీకారముఁ జేయుటకుఁ బాండవులు సిద్ధ ముగానుండిరి. కాని ధర్మబద్ధులు సమయనిబద్ధులుగాన వారు ప్రతిజ్ఞలమాత్ర మొనర్చిరి. ద్రౌపదీ వస్త్రాపహారణముఁ గావించిన దుశ్శాసనుని.

మ॥ కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవులనేకుల్ సూచుచుండన్మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లుసేసినఖలుఁ, దుశ్శాసనుఁ, లోకభీ
కరలీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైలరక్తౌఘ ని
ర్ఝరమున్ర్వీపతి సూచుచుండ ననినాస్వాదింతు నుగ్రాకృతిన్॥

అనియు, నింక దుర్యోధనుని,

ఉ॥ ధారుణి రాజ్యసంపద మదంబున కోమలి కృష్ణఁజూచి రం
భోరు నిజోరుదేశమున నుండగఁబిల్చిన యిద్దురాత్ము దు
ర్వార మదీయబాహు పరివర్తిత చండగదాభిఘాత భ
గ్నోరుతరోరు సేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్

అనియుఁ, బాండవు లరణ్యావాసమునకై పోవునపు డభిప్రాయ గర్భితములైన చేష్టలద్వార మఱికొన్ని ప్రతిజ్ఞలఁజేసిరి.

ద్యూతమునందు ద్రౌపది మూలముగాఁ బాండవులకు జరిగిన పరాభవముముందు దమకుఁ బూర్వము జరిగిన యవమానములు బహుస్వల్పముగాఁ గనఁబడెను. దీని తర్వాతఁ గూడ నిట్టి యవమానము ద్రౌపదికిఁగాని పాండవులకుఁగాని జరుగలేదు. అట్లు జరిగినను నవి యీమెకంత దుస్సహముగాఁ నుండలేదు. ద్వైతవన మందు ద్రౌపదిని మోహించి తోఁబుట్టువు వావినైన గణింపక బలాత్కారముగ నెత్తుకొని పోయిన జయద్రథునిచేఁ బొందిన పరాభవము నంతగాఁ బాటింపక 'యవమానము దనకుఁ బరిపాటి' యని తలంచె. పిమ్మట విరాటుని కొలువున కీచకునిచేఁ బొందిన యవమానముఁ గూర్చి ద్రౌపది భీమునితో నిట్లనెను.

ఉ॥ మీసుభటత్వముల్ బలము మిన్నకపోవఁగ దుస్ససేనుఁ డ
ట్లాసభలోన నన్ బఱచె నంతియగాక జయద్రథుండు సం
త్రాసభరంబులే కనుచితం బొనరించినఁ జెల్లిపోయె నే
డీసభికుల్ గనుంగొనఁగ నిట్లయితిన్ వగ నాకు వింతయే.

మొదటినుండి ద్యూతమువఱకు జరిగిన కథకుఁ బర్యవసానము ద్యూతము. ఇఁక ద్యూతముయొక్క పర్యవసాన మరణ్యపర్వ మాది గాఁగల పదియాఱుపర్వము లందలికథ.

ప్రథమమున ధర్మరాజుతో నారదుఁడు రాజసూయా ధ్వరముఁ గావింపుమని చెప్పి, యట్లు క్రతువుఁ గావించిన యెడల తుదకు సకలజననాశనకరమగు మహాసమరంబు జరుగునని తెలిపెను. క్రతువైన పిమ్మటఁగూడ నారదాది ఋషులు ధర్మజునీడ్కొని పోవునపుడు కొలఁదికాలములో మహాయుద్ధము రానున్నదని చెప్పిపోయిరి. అందుచే రాజసూయము మహాయుద్ధమునకు మూలకారణమైనది ఈ కారణము నవీన నాగరికతగల మనకు సామాన్యముగా విశ్వాసార్హముగా నుండకున్నను శత్రువులకు మత్సరము పెరిగియుండుటచే యుద్ధమనివార్యము; కాన రాజసూయయాగము మూలమున ద్యూతము, తత్ఫలితముగ నరణ్యాజ్ఞాతవాసములు, తరువాత యుద్ధము సంభవించినది. ద్యూతమునందుఁ బరాభవముఁ బొందిన పాండవులు దుర్యోధనాదుల వధింతుమని చేసిన ప్రతిజ్ఞలు రాఁబోవు యుద్ధమును సూచించు చున్నవి. ఈ ప్రతినలఁబట్టి పదుమూఁడు సంవత్సరముల పిమ్మట పాండవులకుఁ గౌరవులు దిరిగిరాజ్యము నీయరనియు, గౌరవ పాండవుల సంధికై శ్రీకృష్ణుఁడు కాఁడు

మఱి త్రిమూర్తులు రాయబారము జరిపినను గుదురదనియు ముందే స్పష్టపడుచున్నది. సంధికుదిరిన ప్రతిజ్ఞలు నెఱవేఱవు కాన నిది పూర్తిగా నెఱిఁగియే యర్జునుఁడు పాశుపతాద్యస్త్ర సంపాదనకై ప్రయత్నించుట జరిగెను. సంధి విఘ్న మగుటకుఁగూడ ద్రౌపదీమానభంగమే కారణము. రాయ బారిమైపోవు శ్రీకృష్ణునకుఁ దనపరాభవము నిరూపించి ద్రౌపది దన విడిపోయిన వెండ్రుకలు గోవిందు ముందటఁ బెట్టి యిట్లనియె,

క॥ ఇవి దుస్ససేను వ్రేళ్ళఁ
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి కౌ
రవులకడఁ దీఱుమాటల
యవసరమునఁ దలఁప వలయు నచ్యుత పిదిన॥ విరా. II.

అట్లు జరుగుటచే సంధివిఘ్నమైనది. ద్రౌపదీ మానభంగము వలన భీమార్జున నకులసహదేవుల హృదయములం బయలు దేఱిన క్రోధాగ్నిజ్వాల లేకమై కౌరవులను మహారణ్యమును దహించుటకుఁ గార్చిచ్చైనది. అనంతర పర్వములంగుఁ బాండ వుల దృష్టి ద్రౌపదీమానభంగ ప్రతీకారమునందే లగ్నమై యున్నది. దీనియొక్క పర్యవసానమే సంగ్రామము. పాండ వుల ప్రతిజ్ఞలు నెఱవేఱుటకై కురుక్షేత్రమున ఘోరసమరము జరిగెను. పాండవులు వనవాసము సేయుకాలమున దుర్యో ధనుఁడు సామంతరాజుల వశముచేసికొనెను. కొందఱు పూర్వమే రాజసూయాధ్వరమువలనఁ బాండవులపై నసూయా పూరితులైరి కాన వారందఱు కౌరవపక్షమునఁ జేరిరి. అందుచేఁ

పాండవుల సైన్య మేడక్షౌహిణులు మాత్రముండఁగా, కౌర వులకు పదునొక్కం డక్షౌహిణుల సైన్యముండెను. పాండవరాజ సూయాధ్వరము కృష్ణపాండవులకుఁ గల పరస్పర గౌరవముం దెలిపి, 'పార్థ రక్షా'బలమును, పవనసుతు బాహుబలమును, శ్రీకృష్ణుని నిర్మలనీతిబలమును ధర్మజునకుఁ బూ ర్తిగఁ గలుగుటచే నేకార్యము జేయుట కైన నసాధ్యము లేదని ప్రకటించెను. (సభా i 16.) ఈ క్రతువువలన దుష్టుల పాప మొక్కమాఱుగాఁ బెరిగి పరిపక్వావస్థకుఁ దేఁబడి మూలచ్ఛే దముఁ జేయఁబడినది. దుర్యోధన దుశ్శాసనుల వినాశాంతము లకుఁ గారణమగు ద్రౌపదీవస్త్రాపహరణాదులఁ గర్ణుఁడు సేయు నని సూచించుటచేఁ గర్ణుఁడు వారి నాశనమున కొకవిధముగాఁ గారకుఁడాయెను. అందుచే 'కర్ణుని తలభారత' మనువాక్యమును సమర్థించుచున్నది. ఇదియు ద్యూతపరిణామమే.

ఇంతవఱకు గోముఖవ్యాఘ్రమువలె నున్న ధృతరాష్ట్రుని యథార్థ స్వభావము గూడ ద్యూతముతోఁ దేటతెల్లమైనది. ఈ పర్వమందే భారతమందుఁగల ముఖ్యపాత్రల యథార్థశీల ములు వెలిపఱుపఁబడినవి. పాండవుల ధర్మపరతంత్ర బుద్ధియు, వారల శౌర్యము, దుష్టచతుష్టయముయొక్క దుర్మార్గప్రవర్తన, భీష్మవిదురాదుల నిష్పక్షపాతబుద్ధి, ద్రౌపదీ పాతివ్రత్యము మొనలైనవి స్పష్టపడినవి. కాన భారతవీరుల శీలములు గూడ సభాపర్వకథ మీఁద నే యాధారపడియున్నవి. ధార్తరాష్ట్రులను జయించుటకును, దమ ప్రతినల నెఱవేర్చుకొనుటకును పాండ వులు యుద్ధమందొనర్చిన యన్యాయమునకు మూలకారణము

ద్యూతమును ధార్తరాష్ట్రులు ప్రథమమున నొనర్చిన యన్యాయమే కాన పాండవుల యధర్మ యుద్ధమునకుఁ గూడ సభాపర్వకథయే మూలమైనది.

ఒకవేళ సభాపర్వ కథాభాగము లేకయుండిన, నను గా రాజసూయయాగము జరుగకుండినఁ గౌరవపాండవుల స్థితి యెట్లుండెడిదని ప్రశ్న. పాండవులు రాజసూయాధ్వర మొనర్పకుండిన దుర్యోధనునకుఁ బాండవుల యైశ్వర్యముపై నసూయయు, మయసభావమానమును గలుగవు. అందుచే పాండవ కౌరవ ద్యూతమును సంఘటింపదు. అందు ద్రౌపదీపరాభవమున కవకాశముండదు. పాండవధార్తరాష్ట్రుల యాంతర్ద్వేషము బహిర్గత మయ్యెడిది కాదు. పాప మొక్కమాటుగాఁ బెరుగదు. దుర్యోధనుఁ డసూయచే మనస్సునందుఁ గుమిలి పోవలసినవాఁడే. పాండవులరణ్యాజ్ఞాత వాసములఁ జేసెడివారు కారు. కురుక్షేత్ర సంగ్రామము జరిగియుండదు. అందుచే దుష్ట సంహారము సలుపఁబడదు. కాకతాళీయన్యాయముగ జరాసంధ శిశుపాలవధ లప్పుడుజరుగవు. భారతకథ పూర్తిగ మారియుండెడిది. అందుచే సభాపర్వమందలి కథ భారతకథయందు గల పూర్వోత్తరకథల నైక్యముఁ గూర్చి ముఖ్యస్థానము వహించియున్నది. కాన భారతకథ యంతయు సభాపర్వకథ మీఁదనే యాధారపడియున్నదని స్పష్టమగుచున్నది.



# పోతన

భరతదేశ మందలి సకలభాషలందు రామాయణ మగ్రస్థానము వహించుచున్నది కాని యాంధ్రభాషయందు మాత్రము దీని కపవాదముగలదు. ఆంధ్రమున భారతమువ్రాసి కవిబ్రహ్మయని తిక్కన వాసి కెక్కెనను నాంధ్రులరసనాగ్రము లందు పోతనపద్యము లతికినంత కమురుగ తిక్కన పద్యము లతుకలేదు. ఇందులకుఁగారణము కవిగతముగాని కావ్య గతముగాదు. భాగవతాంధ్రీకరణము పోతనచేతిలోఁబడుట యాంధ్రుల నోములపంట. అందుచేఁగవియు సిద్ధసంకల్పుఁ డయ్యెను. అట్లే పోతనయు భావించెను.

మ॥ ఒనరన్ నన్నయ తిక్కనాదికవు లీయుర్విన్ బురాణావళుల్
తెనుఁగుంజేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు దానెట్టిదో
తెనుఁగుంజేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁజేసెదఁ బునర్జన్మంబు లేకుండగన్.

అట్టికవి వ్యక్తిత్వముఁగూర్చి తెలిసికొన బ్రయత్నించుటే ప్రస్తుతకర్తవ్యము. దైవయోగమున కేతన దశకుమారచరిత్ర మును తిక్కనకంకిత మొసఁగుటచే నందలి యాశ్వాసాద్యంత పద్యములఁ గృతిపతివంశవర్ణముఁ బట్టి తిక్కనవ్యక్తిత్వము గొంత తెలియుచున్నది. కాని యిఁకయే యితర కవిని గూర్చియైనను మనకంత స్పష్టముగఁ దెలియదు. పోతనఁగూర్చి గోత్రపితాదినామములు దప్ప మన కేమియుఁదెలియవు. పరం పరాగత కథలును పోతన భాగవతమును దప్ప యతని విజ్ఞాన

స్వభావ స్వరూపాదులనుగూర్చి తెలిసికొనుట కితర సాధనములు లేవు. కాన భాగవతమందుఁ బ్రతిఫలించిన పోతనను మాత్రమే మనము చూడఁగలము. నన్నయాదులు దమ్ముఁగూర్చి తమ కావ్యములందుఁ జెప్పికొని నంతమాత్రమైనను పోతన దన భాగవతమునఁ జెప్పికొనలేదు. దీనికిఁదోడు పోతన సహజపాండిత్యము గలవాఁడగుటచే నతనిగురువు మొదలగు వారిఁగూర్చి తెలిసి కొనుట కవకాశము లేదు. అట్లయ్యు నాంధ్రభాగవతము పేరువిన్నంతనే ప్రాజ్ఞుఁడైన ప్రతియాంధ్రుని మనోనేత్రమునకు నొక పవిత్రమూర్తి గోచరించి వందనార్హుఁడగును. పిమ్మట నాతనిభాగవతముఁ జదివినచో నాతనియాత్మీయత మనకగపడును. భాగవతమున పోతనవ్రాసిన ప్రతిపద్యమునందు పోతనవ్యక్తిత్వము ప్రతిబింబించుచున్నదని చెప్పవచ్చును. పద్యమును వినినవెంటనే పోతనపద్యమని గుర్తింపవచ్చును. అట్టి విశిష్ట లక్షణములు పోతన జీవితమందు గలవు. అవియే యతని కవిత్వమందుఁ బ్రతిఫలించినవి. భక్తివైరాగ్య ప్రభావములు పోతనను సంసారమునందుఁ బట్టుపడనీయకున్నను, కవిత్వమునందు మాత్రము పట్టుపడనిచ్చినవి, కాన నతని భాగవతమందతఁడు సులభముగ గోచరమగుచున్నాఁడు.

ప్రారంభమున పోతన కవులందఱివలె రాజుల నాశ్రయించినట్లు భోగినీదండకమువలనఁ దెలియుచున్నది. కానిపిమ్మట వారి ప్రవర్తనమతనికి గర్హణీయముగఁగనుపించి వారిసంపర్కమునకు రోఁతజెందినాఁడు. ప్రథమమున నీతనికి రాజపరిచయమువలన గల్గిన రోఁతయే యతనికిఁ బ్రాపంచికవిషయములందు వైరాగ్య

మును బరమేశ్వరునందు నిశ్చలభక్తియుం గూర్చినది. రావుసింగ మహీపాలునితోడి పరిచయానుభవములవలన నీతని జీవితము నందు గొప్పపరివర్తనము గలిగినది. ఆ రాజానుభవము పోతనకొక మహోధర్మోపదేశముఁ జేయఁ దనబుద్ధిని శ్రీరామ చంద్ర పాదారవిందములందు భక్తిసలుపుటకై మరలించినాఁడు. ఇఁక నది తిరుగు మొగము పెట్టదు. అదే తనకు మోక్షసాధన మైనది. శ్రీనాథాది కవులందఱు రాజుల ప్రాపకమున సర్వ సౌఖ్యములఁబొంది యదియే భూలోకస్వర్గమని తలంపగ నీతని స్థితి యిట్టిది. దీని కితని పూర్వజన్మ సుకృతమే ముఖ్యహేతువు. పోతనకు రావుసింగనతోఁ బరిచయము గలుగకుండిన పోతన జీవయాత్ర యెట్లుండెడిదో. ప్రపంచమున సర్వము నొకొక్క ప్రయోజనముతోడనే విధి సంఘటింపఁ జేయుచుండును కదా!

పోతన దన యమేయమైన నిష్కల్మషభక్తివలన సర్వ కాల సర్వావస్థలయందుఁ దన మనోనేత్రమునకు

సీ॥ ఇందీవరశ్యాము వందిత సుత్రాముఁ
గరుణాలవాలు భాసుర కపోలుఁ
కౌస్తుభాలంకారుఁ గామిత మందారు
సురుచిర లావణ్యు సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ
బన్నగశయను నబ్జాతనయను

తే॥ మకరకుండలసద్భూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు॥ X. ఉత్తర. 979.

తన సంపూర్ణ దివ్యమంగళ విగ్రహముతో సాక్షాత్కరింపఁ జేసికొనినాఁడు. అదియే తనకు జీవన్ముక్తియని తలఁచెను. అట్టి దివ్యమూర్తి దననేత్రముల యెదుట నిత్యమును దాండ వించుటచేఁ పోతన యెప్పుడు విష్ణునామ ముచ్చరింప వలసివచ్చిన నేకనామస్మరణ మాత్రముచే సంతృప్తిఁ జెందు వాఁడు గాఁడు. అట్లుసేయుట యపచారమని యెంచెనేమో? కాన విష్ణువుగుణములనో, వివిధనామములనో నోరార వర్ణించి ననే కాని యతనికిఁ దినివిదీరదు. తనకు సాక్షాత్కరించిన విష్ణు స్వరూపమునే పోతన కుచేలుఁడు, ప్రహ్లాదుఁడు, మైత్రేయుఁడు మొదలైన భక్తుల కొసఁగెను. సాక్షాత్కృత విష్ణువును బ్రహ్మా దులు చేసిన స్తుత్యాదులు పోతన దన భవబంధ మోక్షమునకై చేసికొనిన విన్నపములే. ఇతఁడు విష్ణువు నెపుడు స్తుతించినను 'భవలతా లవిత్ర, భవసాగర తరణ, భవబంధమోక్ష' యనియే చేయునాఁడు. ప్రారంభమున నతఁడు గోరినదే యిది '(శ్రీ) కైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదఁ లోకరక్షైకారంభకు.'

పోతన ప్రపంచము నంతయు భక్తిమయైక దృష్టితోఁ జూచుటచే భక్తికంటె నితరములైన సర్వము తుచ్ఛమని భావించినాఁడు. ఇట్టి భక్తియోగమునకు వైరాగ్యము తోడైనది పోతనాఖ్యునకు. సర్వకార్యములు నిష్కామదృష్టితోఁ

కృష్ణార్పణముగాఁ జేయవలయు ననియు, నశాశ్వతములైన ప్రాపంచిక సుఖములకై పెనఁగులాడి ప్రయోజనము లేదనియు శాశ్వతమైన కైవల్యమును భక్తిమార్గముచే సాధింపనలయునని విశ్వసించువాఁడు. ముక్తసంగుఁడు. ఇట్టివానికి భక్తిలోకము వినా యితర ప్రపంచముతోఁ బ్రసక్తి యేమి? అందుచే నితర ప్రపంచమెట్లుండెనో యెఱుఁగఁ బ్రయత్నించలేదు. ఈతఁడు యాధ్యాత్మిక సౌఖ్యమునకుఁ బ్రయత్నించినాఁడుగాని యైహిక సౌఖ్యమున కాశింపలేదు. శ్రీనాథుఁడొక చెంత దీనారటంకాలతో స్నానముఁజేసి, రత్నాంబరంబుల ధరించి, హేమపాత్రములలో భుజించి కస్తూరికాది పరిమళ ద్రవ్యముల సేవించి భోగము లనుభవించుచుండ, పోతన 'నిజదార సుతోదర పోషణార్థమై హాలికుఁడై' 'కమలాక్షునర్చించు కరములు కరము' లని శరీరావయవములు భక్తితోఁ బరమేశ్వరుఁ బూజించుట కుపయోగించును గాని యన్యమునకుఁగావనియు, జీవుఁడు భగవద్భక్తి కొఱకే జీవించవలెనని యెంచెను.

తే. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరుకీర్తి నుడువఁడేని
గలుగఁనేటికిఁ దల్లుల కడుపుఁజేటు.

విష్ణుభక్తి గుదిరిన జీవుఁడు జగమున నితరము దేనినిఁ గోరడని యీతని భావము. దీనినే వివిధసాదృశ్యములతో బోధించువాఁడు పోతన.

సీ॥ మందారమకరంద మాధుర్యమునఁదేలు
మధుపంబుఁబోవునే మదనములకు

నిర్మలమందాకినీ వీచికలఁ దూఁగు
రాయంచ చనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కు-
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందుచంద్రికా స్ఫురితచకోరకం
బరుగునే సాంద్రనీహారములకు;

తే॥ నంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబుఁ జేరనేర్చు
వినుత గుణశీల మాటలు వేయునేల ॥ VII. 150.

ఇదియే యీతని జీవితయాత్రయందలి ధర్మసూత్రము. ఈ సూత్రము నవలంబించియే యితఁడు జీవన్ముక్తుఁడాయెను. ఇతఁడు ముక్తసంగుఁడై సర్వవిషయములందు విరక్తుఁడగుటకు రహస్యకారణమైన మంత్రమిదియే. ఈ తత్వమును ప్రహ్లాద చరిత్రమందేగాక పోతన దన భాగవతము నందంతటను సందర్భము వచ్చినపుడెల్ల జ్ఞాపకముఁజేసి బోధించుచు నాయుపమానమునే గ్రహించును. ప్రహ్లాదునిచేఁ జెప్పించిన యీ భావమునే బ్రహ్మచేతఁగూడఁ బలికించెను. 'వరమందారపాన కుతుకస్వాంతద్విరేఫంబు సత్వరమై పోవునే చేఁతివేములకుఁ దద్గంధానుమోదాత్మమై. (III. 223.) ఆ వాక్యమునే మైత్రేయుఁడుగూడ నుచ్చరించును. 'సుపర్వమహీజ మరందపాన లాభానుభవమ్ము నొందు మధుపప్రభు వేఁగునె వేఁప చెట్లకుఁ. (III. 442.) ఇట్టి యుదారభావము లన్నియుఁ బ్రహ్లా

దాది పాత్రల భావములుగఁ గూర్పఁబడుటకుఁ బూర్వము పోతన హృదయమందుద్భవ మొందినవి. విష్ణుకథలందు భక్తి నుంచక యితర దుష్టకథలందాసక్తిఁ జూపువాఁడు 'ఊరపంది యాత్మను మధురాజ్యభక్ష్యము-లు మాని పురీషము కేగు చాడ్పునన్' (III. 1022) ప్రయత్నించునని పోతనబోధ. తన మనస్సునందలి భావమును తీవ్రముగ బోధించుటకై మొగ మోట పడువాఁడుగాఁడు పోతన. తా ననుభవ పూర్వకముగ నెఱింగిన తత్వమును హృదయమునకుఁ దాకునట్లు తీక్ష్ణముగఁ జెప్పును. ఇట్టి యంతఃకరణశుద్ధి గలిగియుండుట చేతనే పోతన సర్వజనులచే నేకగ్రీవముగా గౌరవింపఁబడు చున్నాఁడు. ఇట్టి దృఢభక్తిగల వాఁడగుటచేతనే దారిద్ర్య మీతని మనస్సును కలఁత పెట్టఁజాలక పోయినది. కాన నిర్యాణ సమయమందుఁ గూడ పరమశాంతహృదయముతో నుండి యానంద మొందుచు నస్తమించినాఁడు.

సమకాలికుఁడై బాంధవుఁడని ప్రతీతిగల శ్రీనాథుఁడు మహాజ్ఞానియు పండితుఁడు నయ్యుఁ దన జీవితకాలమంతయు నైహిక సుఖములనే యాశించి, మహాభోగము లనుభవించి కవి సార్వభౌముఁడని యశముగాంచినను మరణసమయమున పరమ దరిద్రుఁడై యమయాతనఁ బడక తప్పినదికాదు. ఈ సంగతిఁ దొలినాఁడే గ్రహించిన తత్వవేది పోతన. అందుచేతనే తన భాగవతమును మానవుల కంకితమీయక, సర్వవస్తువులతోఁ బాటు తన హృదయమునుగూడ విష్ణువునకు సమర్పించి, శరీర

ముతో మాత్రము దాను మిగిలినాఁడు. ఇట్టివాఁడు సంకల్ప సిద్ధుఁడుగాక మఱి యెవ్వఁడగును?

బుద్ధుని యహింస యెంత పరమోత్కృష్టమైనదో, పోతన భక్తియంత యుత్కృష్టమైనది. బుద్ధుఁడు దన మతమును బౌద్ధపీఠముల మూలమునఁ బ్రచారముసేయఁగ, పోతన భాగవతము మూలమునఁజేసెను. భక్తిమార్గము నాంధ్రుల కుద్బోధించినవారు రామానుజుఁడు బసవన పాల్కురికి సోమనాథుఁడు మొదలగు పలువురు గలరు. వీరి వీరవైష్ణవము గాని వీరశైవముగాని తామసికభక్తిప్రధానమైనది. పోతన త్యాగయ గోపనాదులభక్తి సాత్త్వికమైనది. అందు త్యాగయ గోపనలు దమభక్తిని గానపరముగ వ్యక్తీకరింపఁగ పోతన కావ్యమూలమునఁ బ్రకటించినాఁడు. వీరు ముగ్గురును స్వానుభవ పూర్వకమైన భక్తిభావముల వ్యక్తీకరించు కవులే. పోతన భక్తి యకల్మషమైనది. భక్తిలేని కర్మమార్గముగాని జ్ఞాన మార్గముగాని నిష్ప్రయోజనమని యీతని భావము. యజ్ఞ యాగాది కర్మాచరణముకంటె భక్తియే శ్రేష్ఠమైనదని యీతఁడు నమ్మినాఁడు. 'క్రతుదానోగ్ర తపస్సమాధిజప సత్కర్మాగ్ని హోత్రాఖిలవ్రత చర్యాదుల నాదరింపవు... నీపదాబ్జ యుగళీ సేవాభిపూజా సమర్పిత ధర్ముండగు వాని భంగి' (III.301) భక్తిలేని యజ్ఞయాగాది కర్మములు చేయుట వలన ధనవ్యయమేగాని ముక్తిరాదని యీతఁడు బోధించెను.

చ॥ అకుటిలభక్తి కేశవ సమర్పణ బుద్ధిఁ గ్రతుక్రియల్ వొనర్పక విపరీతులై, యముకరాసులు దంచి ఫలంబు నందగా

నక చెడురీతి, నూరక ధనవ్యయమూటయకాని మోక్షదా
యకమగుచున్న తత్ఫలమునందరు విష్ణుపరాఙ్ముఖక్రియల్॥

భగవత్సాక్షాత్కారముఁ బొందుటకు భక్తిమార్గముపయో గించినట్లు కర్మమార్గముపయోగపడదని యీతని యుపదేశము. 'క్రతుకర్మములు పెక్కుగావించియును నినుఁబొడగానలేక.' (I'I. 307.) ఇది మెఱిఁగిన వాఁడు గాఁబట్టియే కాఁబోలు పోతన నన్నయ తిక్కనలవలె యజ్ఞముఁజేసిన వాఁడు వలెఁ గానఁబడఁడు. ఇట్టి నిశ్చలమైన యుత్కృష్ట భక్తిగల్గిన వానికి యజ్ఞయాగాది కర్మలతోఁ బ్రయోజనమేమి? భక్తిలేని కర్మమార్గమువలె భక్తిలేని జ్ఞానమార్గము గూడ ముక్తిదాయకము గాదని యీతని మతము. 'ధర్మతత్త్వధీ పరిణతిసాధనంబగు స్వభావముఁ దాల్చిన యట్టి మర్త్యులు......తదంఘ్రి పంకరుహము లర్థిమైఁ గొలువఁ గానమిఁ బొందరు తత్పదంబునన్' (III.510.) అని నిరూపించి భక్తిమార్గము మార్గత్రయములలోఁ శ్రేష్ఠమైనదని పోతన సిద్ధాంతముఁ జేసినాఁడు.

మానవ జన్మమెత్తిన వానికి దయ ముఖ్యముగా నుండవలయుననియు నదిలేకపోయిన నాజన్మ వ్యర్థ మనుభావమీతని హృదయమున జీర్ణించినది. ఈ భావమును తన పాత్రలయందారోపించుటయే కాక భగవంతుని కరుణాంతఃకరణవ్యగ్రతఁ బరిపరివిధములఁ బ్రకటించినాఁడు. తన కుమారులఁజపిన యశ్వత్థామను భీమాదులు ద్రౌపదియొద్దకుఁ గొనిరాఁగ నామె యతని హృదయము గరుగునట్లుగ,

శా॥ఉద్రేకంబునరారు శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు కిం

చిద్ద్రోహంబును నీకుఁ జేయరు బలోత్సేకంబుతోఁ జీకటిన్
భద్రాకారులఁ బిన్నపాపల రణప్రౌఢ క్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా నీ చేతు లెట్లాడెనో॥
అనిపలికి పుత్రవధప్రతీకారముఁ జేయఁగల్గియు దయాంతఃకరణము గలదియై ద్రోణునిభార్యయందు సానుభూతిఁజూపుచు,

ఉ॥ ద్రోణునితోడ శిఖింబడక ద్రోణకుటుంబిని యున్న దింట న
క్షీణ తనూజ శోక వివశీకృతయై విలపించుభంగి నీ
ద్రౌణిఁ దెరల్చి తెచ్చుటకు దైన్యమునొందుచు నెంత పొక్కునో
ప్రాణవిముక్తుఁడైన నతిపాపము బ్రాహ్మణహింస మానరే॥

అని ద్రౌణిని మన్నింపఁగ, భీముఁడుసహింపక యతని చంప నున్నతఱి నామె వానికడ్డపడినట్లు పోతన చిత్రించినాఁడు. ఏమి యీ యౌదార్యము. మఱియు గజేంద్రునియందు కరుణా పూరితమానసుఁడై యాతని రక్షింపఁదలఁచి విష్ణుఁడు

మ॥ సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁడభ్రగపతిం బన్నింపఁడా కర్ణికాం
తర ధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై॥

అని నుడివినాఁడు పోతన. భాగవతమున సందర్భముగల్గిన చోట్ల యందంతట నీ దయారసమును పోతన చిప్పిలఁజేసినాఁడు. ఇట్టి దయాస్వరూపము నెఱిఁగినవాఁడు గనుకనే 'దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని' అని ప్రారంభమున నిశితముగాఁ జెప్పి నాఁడు. తాను దయారసార్ద్ర హృదయుఁడుగానినాఁడు పోతన యింత తీక్ష్ణముగ బోధింపఁగలఁడా! ఈతని దయతో సత్యభాషి

త్వము మైత్రిఁజెందినది. త్రికరణ శుద్ధమైన సత్యపరిపాలన వ్రత మీతని జీవితమందలి మహోత్కృష్ట గుణములలో నొకటై కవి పేరుని జేసినది. తా నెఱిఁగిన సత్యమును భయముగాని మొగ మోటము గాని లేక చెప్పువాఁడు. ఆత్మనాశనకర సమయ మందుఁ గూడ బలిచక్రవర్తిచే నిట్టి సత్యపరిపాలన వ్రతమును దీవ్రముగఁ జేయించి పోతన దన యాత్మశీలమును బ్రతిఫలింపఁ జేసినాఁడు. బలిచక్రవర్తి శుక్రాచార్యులతో నిట్లు చెప్పెను.

మ॥ నిరయంబైన నిబద్ధమైన ధరణీ నిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజముల్ రానిమ్ముకానిమ్ముపో
తిరుగన్నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్ ॥

ఇట్టి సుకుమారగుణములుగల పోతనకు భగవత్పరీక్ష వచ్చినది. పోతనకవి తన భాగవతమును నరాంకితము సేయనని సంకల్పించుకొనిన సమయంబున సర్వజ్ఞసింగ మహీపాలుఁడు శ్రీనాథుని ముఖంబున భాగవతముఁదన కంకితమీయు మని పోతన నడిగినాఁడు. రాజు సర్వైశ్వర్యముల నిచ్చుటకు సిద్ధముగానుండెను. అంకిత మీయకయుండిన దండితుఁ జేయుదునని బెదరింపులు సాగుచున్నవి. తన గృహస్థితియు నైశ్వర్యవంతుఁడైన తోటికవి యొక్క యైహికసుఖ జీవితమును శ్రీ నాథునియందుఁ జూచుచుండెను. ఇది పోతన బాహ్య స్థితి. పోతరాజుయొక్క యంతరంగమున విష్ణుమూర్తి భాగ వతము నంకితమాశించి దయచేసినాఁడు. కైవల్య మిచ్చెద నని యభయహస్తమెత్తినాఁడు. ఇవి పోతన పరిస్థితులు. అతఁడు జాగ్రత్తగా రెంటిని త్రాసులోఁబెట్టి చూచినట్లు సూచి

నాఁడు. ఒకవైపున లక్ష్మీదేవి, రెండవవైపున విష్ణుమూర్తియుఁ దన హృదయమును బరీక్షించుచుండిరి. లక్ష్మియున్న తులాభాగ చాంచల్యమును విష్ణువున్న వైపుత్రాసు నిశ్చలముగా నుండుటయు పోతనార్యుఁడు గనిపెట్టినాఁడు. ఇంతలో వీరి కోడలు నాగతియేమని చెప్పితివని 'కాటుక కంటి నీరు చనుకట్టుపయింబడ' సాక్షాత్కరించినది. దయార్ద్ర హృదయుఁడు గాన పోతన 'యేల యేడ్చెదో

కైటభదైత్యమర్దనుని గాదిలికోడల యోమదంబ యో
హాటక గర్భురాణి నినునాఁకటికిం గొనిపోయి యల్ల
కర్ణాట కిరాటకీచకులకమ్మఁ ద్రిశుద్ధిగనమ్మ భారతీ!

అని చెప్పియోదార్చినాఁడు. విష్ణువువైపున బలమధికమైనది. అత్తగారొక్కతెమే యైనది. ఇది యత్తాకోడండ్రకసూయాజనకమయ్యెను. పోతన సంపూర్ణవిజయముఁ గాంచినాఁడు. సర్వజ్ఞసింగన బెదిరింపు లింకసాగిరావు. అభయ ప్రదాతయైన విష్ణువభయమిచ్చుచుండ పోతన మీఁద నీగైనను వ్రాలదు.

ఇట్టి భక్తుఁడైన పోతన విగ్రహమెట్లుండునని విచారణ. విష్ణుభక్తుఁడు కృశీభూత శరీరుఁడెప్పుడును గాఁడని పోతనయుద్దేశము. 'కృశీ భూతాత్మకాయుఁడయ్యు నలినోదరాలాప నవ సుధాపూరంబు శ్రోత్రాంజలులఁ ద్రావి చొక్కియున్న కతన కృశీభూతకాయుఁడు గాక' (III. 772) యుండును. ఇందుచే పోతన భక్తియోగమున సంపూర్ణ దేహదార్ఢ్యముగలిగి, బలిష్ఠావయవ సంపదతో నుండువాఁడని నమ్మవచ్చును. తన మనోనేత్రమునకు నిత్యము విష్ణుమూర్తి సాక్షాత్కరించి మంద

స్మిత వదనారవిందుఁడై పోతనను నవ్వించుచుండఁ బ్రతిహాసన వదనుఁడై నిత్యసంతోషముతో నుండఁడా పోతన! సత్వగుణ ప్రధానుఁడగుటచేఁ బ్రసన్నముఖుఁడును, నహంకార శూన్యుఁడగుటచే వినమితగాత్రుఁడును, తత్వజ్ఞానియగుటచే మహాతేజశ్శాలియునై యుండవచ్చునని మన మూహింపవచ్చును. విష్ణుభక్తుఁడగుటచేఁ బోతన శరీరమునిండ నామధారణమును, కంఠమున తులసి హారములధరించు మూర్తియని భావింపనక్కర లేదు. ఇతఁడు విష్ణుభక్తి పూర్వకమైన స్మార్తుఁడుగాని, రామానుజ మతమునకుఁజెందిన వైష్ణవుఁడుగాఁడు. సదాచార సంపన్నుఁడైన నియోగిబ్రాహ్మణుఁడు. అద్వైతి. అందుచేతనే కృత్యాదిని పోతన త్రిమూర్తుల స్మరించుటయే కాక,

'చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని'

యని హరిహరుల సమానముగఁ గొలిచినాఁడు. పోతనవంటి మహానుభావుని స్వభావస్వరూపములఁ గూర్చి యూహింపఁదలఁచుట సాహసకార్యమే. అతని సంపూర్ణ స్వరూప మతనివంటి భక్తులకే కాని యితరులకు గోచరించుట కష్టము.

పోతనకవి కావ్యప్రయోజనములైన కీర్త్యాదుల నాశింపక తన భాగవతమును శ్రీరామార్పణముగ రచించెను.

ఉ॥ ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁగొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటవ్రేటులం బడక సమ్మతితో హరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్ ॥

నన్నయవలె ఈ కవి

'సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తి లో
నారసిమేలునా నితరులక్షర రమ్యతనాదరింప'

వలెనని యాశించిగాని, తిక్కనవలె, పరులనానందఁబెట్టి కావ్య శిల్పముఁ జూపుటకుఁగాని, శ్రీనాథునివలెఁ దన పాండిత్యమును బ్రకటించుటకుఁ గాని కాక తన భక్తిపూరిత హృదయమును వ్యక్తీకరించుటకే 'బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్య కన్యక' నుపయోగించినాఁడు. ఇందులకు భాగవతమందలి వస్తువవలంబమైనది. ఇతఁడు భవబంధ మోక్షమునకు సాధనముగా కవిత్వము నుపయోగించినాఁడు. పోతన భక్తుల హృదయముల విప్పి వాఖ్యానముసేయుటలోఁ గవిత్వమును రసవంతముగాఁ జేయఁగలఁడుగాని, భిన్న పరిస్థితులందలి వివిధ పాత్రల యుద్రేకపూరిత భావములను గళాదృష్టితో విశ్వజనీనముగ నుండునట్లనుకరించి యాదర్శప్రాయముగ రచించి కావ్యమును బ్రపంచమునకు దర్పణప్రాయముగఁ జేయఁజాలఁడు. అందుచే భాగవతమున కవితా శిల్పమునకై వెదకినఁ బ్రయోజనము లేదు.

కవులను రసోపాసకులనియుఁ గళోపాసకులనియు విభజించినచో పోతన భవభూతివలె రసోపాసకుఁడనియు, తిక్కన కాళిదాసువలె కళోపాసకుఁడనియుఁ జెప్పవచ్చును. శిల్పకళాదృష్టితో రచించిన కవిత్వము రసవంతముగా నుండదా యని ప్రశ్నింతురుగాఁబోలు. అందలి భేదమిది. కళోపాసకుని దృష్టిలో వర్ణ్యస్థితికంటె వీసము హెచ్చినను తగ్గినను రసాభాసమగును.

ఇది కత్తిమీఁది సామువంటిది. రసోపాసకుఁడు కళోపాసకునివలె నిశితాసిధారావ్రతము సేయఁడు. రసోపాసకుఁడు దన మనోగత భావముల వర్ణించుచు తన్ను మఱచి పాఠకుల మఱపించును. కళోపాసకుఁడెప్పుడును బ్రమత్తుఁడుగాఁడు; తన మనోగతభావముల వర్ణించుచు పరుల మఱపించునుగాని తన్ను దా మఱచి, మితిమీఱి ముందు సంగతియు మఱచి యౌచిత్యమునకు భంగ మొనర్పఁడు. రసోపాసకుఁడు దనవర్ణ్యరసమున మగ్నుఁడై, తన్మయమును జెంది, యౌచిత్యము నంగాంగీభావమును గమనింపక యారసావేశ మాగిపోవువఱకుఁ దన మనోగత భావములఁ జెప్పుచునే యుండును. పాఠకులు రసోపాసకుని కవిత్వముచే నాకృష్యమాణులై, కవివలెనే వర్ణ్యవస్తువునందుఁ దన్మయముఁ జెంది యందలియనౌచిత్యాది దోషములపై దృష్టి నిలుపరు. రసోపాసకులకును గళోపాసకులకు భేదమిది.

పోతన తిక్కన లిరువురును మహానుభావులే. ఇర్వురు వ్యాసకృత పురాణముల నాంధ్రీకరించిన మహాకవులే. ఇర్వురుఁ గృష్ణసంబంధ గ్రంథముల రచించినవారే. అట్లయ్యు వీరికవితా దృష్టియందు బహుభేదముండుటకుఁ గారణ మీవ్యక్తుల యందున్న భేదమే. తిక్కన హరిహరా ద్వైతి, పోతన విష్ణుభక్తిపూర్వకమైన స్మార్తమతస్థుఁడు. తిక్కనది నిష్కామకర్మపరమైన జ్ఞానమార్గము, పోతనది భక్తి మార్గము; తిక్కన మహాభోగి, పోతన విరాగి; తిక్కన సంపూర్ణ ప్రపంచానుభవము గల్గిన లౌకికుఁడు, పోతన ప్రపంచ వ్యవహారములఁ దలపెట్టని నిస్సంగుఁడు. కవితామార్గమున తిక్కన

కళోపాసకుఁడు, పోతన రసోపాసకుఁడు. శిల్పకవిత్వమున తిక్కన పోతనను మించును; భావకవిత్వమున పోతన తిక్కనను మించును. ఇందుచే వీరికవిత్వములందు భేదముండుట సహజమే. భక్తిపూరిత కథాసందర్భములందు మాత్రమే పోతన కావ్యగత పాత్రలతో సహృదయత్వము నెఱపి కవిత్వమును చరితార్థము సేయఁగలఁడు. తా నెప్పుడు ప్రహ్లాదాదులవలె శ్రీ విష్ణు భక్తుఁడై భవసాగరమును దాటుటకై ప్రయత్నించెనుగాని లౌకిక వ్యాపారములందు దక్షుఁడు గాఁ గోరలేదు. కథానుగుణముగ యుద్ధములను, నాయికానాయకుల యనురాగమును వర్ణింప వలసివచ్చినపుడు సిద్ధకళాహస్తుఁడు గాక యొకభక్తుఁడా యాపాత్రల వెనుకనుండి యాపనులఁ జేయించునట్లుండును గాని యా పాత్రలు ప్రత్యేకవ్యక్తిత్వముతోఁ జేసినట్లుండవు. భాగవత మందలి కుచేలుఁడు, ప్రహ్లాదుఁడు మొదలైనవారు భక్తసోదరులేకాని భిన్నవ్యక్తిత్వము గల పాత్రలుగారు. అందఱు పోతన గారివలె శ్రీ విష్ణుపాదార్పిత హృదయులు, ముక్తసంగులు. కాని భారతమందలి పాత్రలారీతిగాక వివిధములైన భిన్న లక్షణములుగల వ్యక్తులు. పంచపాండవులు సోదరులైన నొక్కొక్కరు ప్రత్యేక విశిష్టలక్షణముగల శూరులు. శకుంతల, సావిత్రి, దమయంతి, ద్రౌపది మొదలైనవారు పతివ్రతశాఖకుఁ జేరినవారైన నందఱు నేకవిధముగ నుండక ప్రత్యేకవ్యక్తిత్వము గల భిన్నవ్యక్తులుగా గోచరింతురు. పాత్రపోషణమున నాంధ్ర భారత భాగవతకవులకుఁ గల భేదమిది.

భక్తుఁడైన పోతనకవి సత్వగుణ ప్రధానుఁడగుటచే

సాత్త్వికుఁడైన కవియయ్యెను. ఇతఁడు సత్త్వగుణముతో సాత్త్వికులైన భక్తుల హృదయముల నెఱిఁగి, సాత్త్వికోద్రేకములనే పొంది తనభావముల వ్యక్తీకరించినాఁడు. ఆ కవితాసృష్టియుఁ దనది కాదనుచున్నాఁడు. భక్తిచే శ్రీరాముని వశముచేసికొని యాతనిచేఁ బలికించుకొనినాఁడు. 'పలికించు విభుఁడు రామభద్రుండట.' (I. 18.) భాగవతాంధ్రీకరణము భారతాంధ్రీకరణమువలె మూలము నతిక్రమించి సంక్షిప్తము చేయఁబడలేదు. పోతన కొన్నిచోట్ల మూలమును మాత్రము దెలుఁగు చేసియు, గూఢములైన వేదాంతఘట్టములున్న తావుల భాగవతమున కద్వైతపరమగు శ్రీధర వ్యాఖ్యానముఁగూడ నాంధ్రీకరించియు, భగవద్గుణ వర్ణనాదిభాగములందు స్వకీయ భగవద్భక్త్యతిశయమున భగవద్గుణాదుల విశేషముగ వర్ణించి పెంచియు, కొన్ని రసహీనములైన భాగముల త్యజించియు, మూలమున లేక హరివంశ విష్ణుపురాణాది గ్రంథాంతర్గత కథా విశేషములఁ దన కభిమానకరమైన వానిఁ గొన్నింటిని గలిపియు ననేక మార్గములవలంబించి మొత్తము మీఁద సంస్కృత భాగవతముకంటె నాంధ్ర భాగవత మెనిమిదివేల పద్యము లధికముగల గ్రంథముగాఁ జేసినాఁడు.

స్వభావముచే పోతన ప్రవృత్తి రసభావపూరిత మగుటచేఁ దన కవిత్వమున రసపోషణమును బాగుగఁజేయఁ గలిగినాఁడు. దీనికి మృదు సౌకుమార్యగుణములు దోడగుటవలన సమతా ప్రసాద మాధుర్యాది కావ్యగుణము లీతని కవితయందు గానఁబడుచున్నవి. తద్రసానుగుణమగునట్లు పాత్రలమనో

వ్యాపారమును శైలియుఁగూర్చి పోతన రసపోషణమును జేయును. ఏ రసమును వర్ణించినను భక్తిభావమం దిమిడియుండును. భాగవతమున పోతన భక్తి రసామృతమును మృదు మధురశైలియను సువర్ణకలశమున నింపి యాంధ్రుల కందిచ్చినాఁడు. ఈతని కవితాశైలి పండిత పామరజనానంగీకారముం బడసి హృదయాహ్లాదకరముగ నున్నది. పోతనయే

కం॥ కొందఱకుఁ దెనుఁగు గుణమగు
కొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణములగు నే
నందఱ మెప్పింతుఁగృతుల నయ్యై యెడలన్ ॥

అని భాగవతమున వ్రాసినాఁడు. ఈ కాలమున సంస్కృతాంధ్రశైలీ భేదమువలన భిన్నాభిరుచులుగల్గి చర్చలుగూడ జరిగెడివి కాఁబోలు. ఈతని సమకాలీనుఁడగు శ్రీనాథుఁడు గూడ భీమఖండములో,

గీ॥ ప్రౌఢిపరికింప సంస్కృత భాషయండ్రు
పలుకు నుడికారమున నాంధ్ర భాషయందు
రెవ్వ రేమన్న నండ్రుగా కేల కొఱత
నా కవిత్వంబు నిజము కర్ణాటభాష ॥

అని పై విధమగు భావమునే వ్యక్తీకరించినాఁడు. మధుశర్కర సమ్మిశ్రమువలె పోతన సంస్కృతాంధ్రముల నందముగాఁ గలిపి తన కవిత్వమున వాడినాఁడు. ఈతఁడొకొక్కమాఱు తేట తెలుఁగుమాటలతో సరళముగాను, మఱియొకమాఱు దీర్ఘ సంస్కృత సమాసభూయిష్ఠముగాను రచించును. ఈతని కవనము

భావంబునను పదసారస్యమునను ప్రౌఢముగానుండక సుకుమార ముగ నుండును. ఇందర్థసారస్యముకంటె పదవాక్య సారస్య మెక్కువకలదు. అది ప్రయత్నపూర్వకమైనది కాక స్వభావసిద్ధమై యాపాతమధురమైయుండును. ఈతఁడు శబ్దాలంకార ప్రియుఁడు. అందు నంత్యప్రాసమున విశేషాభిమానము. (పోతనార్యుని కవిత్వ మున నంత్యప్రాసము గానమున లయతాళములవలె పరిణమించి మృదంగవ్యాపారము నిర్వర్తించినది.) శబ్దాలంకారముల పోతన వలె రమణీయముగా వాడిన యింకొకకవి లేఁడు. ఈతని కవిత్వ మునకు మెఱుఁగుపెట్టి సర్వజనాదర పాత్రముగ నొనరించిన దీ గుణమే పోతన యచ్చటచ్చట వాడినశబ్దాడంబరములను, వ్యర్థ పూరణ పదములను గప్పిపుచ్చి వీనులకాహ్లాదముఁగూర్చిన దీ గుణమే. మొత్తము మీఁద పోతనకు కవితాసిద్ధి గలిగినది కాని కళాసిద్ధి గలుగలేదు. లోకులు భాషావిషయమున నితనియెడ గలవనుకొను దోషములన్నియు గణనీయములుగావు. మఱియు నీతని రసవత్కవితా ప్రవంతిలో నవి యదృశ్యమై పోవుచున్నవి. 'ఏకోహిదోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః' అన్నట్లగును. సర్వజనాదరపాత్రమై సంగీత సదృశమైన శైలిలోరచించుటచేతను, నిగూఢములైన వేదాంత ఘట్టములను సులభగ్రాహ్యమగు రీతి భక్తిరస ప్రధానముగాఁజేయుటచేతను, భావములందు ప్రౌఢత్వమును పరిహరించి సరసత్వము నవలం బించుటచేతను, పవిత్రమైన తనయాత్మీయతఁ బ్రతిఫలింపఁ జేయు తనసొంతభావములను రసపోషణశక్తితో వ్యక్తీకరించుట చేతను, పోతన యాంధ్రుల సౌధములందును కుటీరములందును గూడ సమాన భక్తిశ్రద్ధలతోఁ బూజింపఁ బడుచున్నాఁడు.

# కవిత్వకళ

విశ్వ మొక గొప్ప కళాకార్యము; దానిశిల్పి ప్రకృతి. ప్రకృతి యనఁగా జగన్నిర్మాణసాధనమైన స్రష్టృశక్తిగాని, వస్తువుల బాహ్యప్రపంచముకాదు. అది పరమాత్మసృష్ట నిర్మాణస్థితి నాశించి సహజకారణబలముతో నాత్మకార్యసాధనకై బహుకృషి సేయుచుండును. కాని తననిర్మాణోపకరణములందుఁ గొన్ని సహజదోషములుండుటచే ననేకవిఘ్నములఁబొందుచుండి యొకవేళ కృతకృత్యురాలైనను బహుమందగమనమునఁ దన గమ్యస్థానమును జేరును. ఏకారణముననైనఁ బ్రకృతికివిఘ్నము గల్గినవెంటనే కళ దానికి సాయమొనర్ప మొదలిడును. కాంక్షిత ఫలావాప్తికై యవలంబింపఁబడు కార్యనైపుణ్యమే కళయనఁ బడును. ప్రకృతిధర్మములఁ గళ శ్రద్ధతో నభ్యసించి తత్కార్య సాఫల్యమునకై యది సూచించు మార్గమునవలంబించును. కాన గమ్యస్థానమును బ్రకృతి కళకుపదేశింపఁగ శిష్యుఁడు గురువునను సరించునట్లు కళ ప్రకృతి ననుగమించును. ఆరోగ్యసాధనకై ప్రకృతి సహజచికిత్సాశక్తిని బ్రయోగించును. కాని దాని యందుఁగల కొన్నిదుర్బలభాగములవలన విఫలప్రయత్నయైన తఱివైద్యకళ యాలోపమునుదీర్చును. వైద్యకళ యారోగ్యధర్మ మందొక మర్మమును గనిపెట్టి నిరంతరపరిశీలనచేఁ బ్రకృతినుండి గ్రహించిన సాధనమునే ప్రయోగించి యారోగ్యమును గూర్చును.

నిర్మాణనైపుణ్యమువలనఁ బ్రకృతి సర్వాంగసుందరము గాఁ గనఁబడినను దానిభాగములలోఁ గొన్ని బహునీచములుగ నుండుటచే నెంత ప్రయత్నించినను దాఁ బొందఁగోరిన యాదర్శ రూపమును బొంద నశక్తురా లగును. అంత ప్రకృతియాశించిన యాదర్శరూపమును గళ ప్రారంభమున భావనచేసి మనసు నందు దానికొకరూపము నొసఁగును. అప్పుడు ప్రకృతిరచ నాధోరణియందుఁ గల దోషములు, విఘ్నములెల్లఁ దొలఁగింపఁ బడి ప్రకృతియాశించిన యాదర్శము తేజస్సుతోఁ బ్రకాశిం చును. ఇట్లు సంస్కారయుతమైన ప్రకృతియొక్క మూలరూప మును గళ ప్రదర్శించును. సౌందర్యరేఖ, తేజము, నాకర్షించు విగ్రహము, శీలము, విజ్ఞాననాగరకతాదులు గల యాదర్శ పాత్రమైన యొకసుందరిని బ్రకృతి సృష్టింపఁదలఁచినపుడు, తన యంతర్భాగములందుఁగల కొన్నిలోపములవలన నా సృష్టింపఁ బడిన వనితయందొక గుణలోపముగల్గును. ఇట్లెన్నిమాఱులు ప్రయత్నించిన నేదోయొకగుణము కొఱఁతవడుచునేయుండి తానాశించిన యాదర్శసుందరి నిర్మింపఁబడఁజాలక ప్రకృతి విఫలమనోరథ యగును. అంత ప్రకృతిధర్మముల ననుసరించి సమస్తగుణములు గల శుభాంగిరూపమును గళోపాసకుఁడు మనస్సున భావనసేసి తదనుగుణముగ చిత్రలేఖనమునఁగాని, శిల్పమునఁగాని, కవిత్వమునఁగాని దానికొకరూపమునొసఁగును. కాన నింద్రియగోచరమును ననుభవవేద్యమునగు రక్తమాంసాది వస్తువులతోఁ బ్రకృతినిర్మింపఁగ, భావములతోడను, భావాను కరణముతోడను గళ రచించును. ఈరీతిగ నతనిసృష్టి ప్రకృ

తిలో నొకదానికిఁ బ్రతికృతియైనను నది శిల్పిమనసునను నతఁ డానందపెట్టఁదలఁచినవారి మనస్సులందును మాత్రమే యుండును. కనుక ప్రారంభమునఁ బ్రకృతికిశిష్యయైనను గళ దానికి పోటియై, దాని యసమగ్రతను బూరించి దాని లోపములను దిద్దఁ గలుగుచున్నది.

ప్రపంచమునం దనేకకళలు గలవు. కాని భారతీయులు వానిని చతుఃషష్టి కళలని నిర్దేశించిరి. వాని దృష్టిపథమును బట్టి యవి వ్యావహారిక కళలనియు, లలితకళలనియు విభజింపఁ బడినవి. ఉపయోగమే ఫలితముగాఁగలవి వ్యావహారిక కళలనియు, నానందమే పర్యవసానముగాఁగల కళలు లలితకళ లనియు నిర్ణయింపఁబడి చిత్రకళ, శిల్పము, గానము, నాట్యము కవిత్వమును రెండవదానిలోఁ జేర్పఁబడినవి. లలితకళయందను కరణము ప్రాముఖ్యమగుటచే దాని కనుకరణకళయని పాశ్చాత్యులు పేరిడిరి. సంస్కృతాలంకారికులు లలితకళలలో నొకటైన నాటకమునుగూర్చి చెప్పినపు 'డవస్థానుకృతిర్నాట్య' మ్మని నిర్దేశించిరి; కాని తక్కిన యే లలితకళలకు ననుకరణ మూపాదించినట్లు లేదు. పాశ్చాత్యులలోఁ గొందఱు గానమునఁ గూడ ననుకరణ ముండుననిరి. కాని కొందఱకిది నచ్చలేదు. మిగిలిన కళ లన్నిటికి ననుకరణత్వ మంద అంగీకరించిరి.

అనుకరించుట మానవస్వభావము. అది ప్రతిమానవుని హృదయమందుఁ బాదుకొనియున్నది. అనుకరణవిషయమువలన విశ్వజనీనానందము గలుగును. ప్రకృతిని జిత్రకారుఁడు రమణీయవర్ణముల మూలముననను, గాయకుఁడు మధుర

నాదము మూలమునను, విగ్రహకారుఁడు మృత్తికమూలమునను, నటుఁడభినయమూలమునను, కవి శబ్దసౌందర్యము మూలమున ననుకరించి దాని మహత్త్వమును గ్రహింతురు. ఈ లలితకళలలో నొక్కొక్కదానియం దొక విశేషలక్షణము, నొక్కొక్క లోపమును గలదు. ఇవి మూలవస్తువుయొక్క కొన్ని లక్షణములమాత్ర మనుకరించి చూపి మిగిలినగుణములను మన యూహకువదిలి, పూర్ణానుకరణమందుఁ దమకుఁగల యశక్తతఁ జూపును. చిత్ర కళ నేత్రముల నాకర్షించి మనసుయొక్క సహజరూపమైన యాకారవర్ణములఁ బ్రదర్శించుటచే వస్తువును బ్రత్యక్షము సేయుటయం దితరకళలకంటె నిదెక్కువ శక్తిగలది. కాని యిది యనుకరణవస్తువుయొక్క పొడవు వెడల్పులనుమాత్రమే ప్రద ర్శింపఁగలదు; కాని దాని లావునుగూడఁ జూపఁజాలదు. మఱియు నిది వస్తువుల ముందుభాగమునుగాని, వెనుకభాగమునుగాని చూపఁగలదు; కాని రెంటినొకమాఱు ప్రదర్శింపలేదు. ముఖ మునుజూచి జుట్టునో, జుట్టునుజూచి ముఖమునో యూహించు కొనవలసినదే. ఈ లోపమును విగ్రహరచన దీర్చును. విగ్రహ రచనగూడ నేత్రములనే యాకర్షించి వస్తువుయొక్క యన్ని వైపులనుజూపి చిత్రలేఖనముకంటె నెక్కువ ప్రత్యక్షజ్ఞాన మును గలిగించును. కాని వివిధవస్తువుల ప్రత్యేకరూపమును దెలుపు వర్ణములనుమాత్రము ప్రదర్శింపలేదు. మఱియు సంధ్యా రాగము, సూర్యాస్తమయము మొదలగు భావముల నిది చూపఁజాలదు. చిత్రలేఖన విగ్రహరచనలు రెంటియందు జీవితమందలి వివిధత్వమును, క్రియారూపమగు నవయవచాల

న్క్రమమును జూపుటమాత్రము సాధ్యముగాదు. వాని నిశ్చల త్వమునందుఁ జిత్రింపఁబడిన భావముల బాహ్యాకారముమాత్ర మందు ముద్రితమగును. అందొక ముఖ్యావస్థమాత్రము గ్రహింపఁబడి దాని పూర్వోత్తరావస్థలకుఁగూడ నదే ప్రతి నిధిగా నుండును. కాని వీనియందు విస్తృతి చాల తక్కువ. ఈ లోపములను నాట్యకళ దీర్చును.

నాట్యముగూడ నేత్రముల నాకర్షించి సంజ్ఞలు, ముఖ వికారములు, నవయవవిన్యాసములు మొదలగువానివలన చేష్టల సంచలనమును బ్రదర్శించును. ఇది ప్రత్యేకవ్యాఖ్యానము నభిలషింపని ప్రకృతిసిద్ధమైన భాష. యథార్థమున కది యకృ త్రిమమైన వ్యక్తీకరణమార్గమై, యూహపై నాధారపడక భావమును వెనువెంటనే యర్థవంతముగాఁజేయును. ఆత్మ సంచలన వ్యాపారము నీయవయవ విన్యాసముల మూలమున శరీరమనుకరించి తనయందుఁ బ్రతిబింబింపఁజేయును. కాన నవి శరీరాత్మల యంతరైక్యమునుదెలుపు ప్రత్యక్షసంజ్ఞలై యున్నవి. కాని యితర లలితకళలకంటె నిందు స్పష్టత యను లక్షణము దక్కువ. చైతన్యరహితమైన జగత్తును, దాని వివిధాకారముల నిది యెంతమాత్రము సూపఁజాలదు. ఇఁక కవిత్వము వీనుల నాకర్షించి బాహ్యాంతరకార్యముల సంచలనముగల వివిధసన్ని వేశముల నైతము ప్రదర్శింపఁగలదు. కాని దీనిరూపము కేవలము సంజ్ఞామాత్రమే. వస్తుమూలమగు ప్రత్యక్షస్వరూ పము దీనికెంతమాత్రములేదు. మఱియు వివిధ దేశ జాతులం బట్టి భాష భేదించుటఁజేసి యీసంజ్ఞలును విశ్వజనీనములుకాఁ

జాలవు. కాన నిది యన్యకళలకంటె నెక్కువ యస్పష్టమైనది. విశేషించి సున్నితమైన సూక్ష్మతరభావములను వెలిబుచ్చు సరియైన యర్థశక్తిగల శబ్దము లేభాషయందును లేకపోవుటచేఁ గవిత్వము వానినెంతమాత్రము వ్యక్తీకరింపఁజాలదు. ఈ లోప మును గానము సవరించును. గానము బహు సూక్ష్మతర భావ ములనైనఁ బ్రదర్శించి శ్రోత్రముల నాకర్షించును. ఇతర లలిత కళలకంటె నిది యాపాతసుఖదమైన సద్యఃఫలమునొసఁగును. కాని యిందుఁజిరస్థాయిత్వముగాని, స్పష్టతగాని లేకపోవుటయే కాక ప్రకృతియొక్క బాహ్యాకారము నిది యొంతమాత్రము ననుకరింపఁజాలదు. కాన లలితకళలలో నేదియు మూలమును పరిపూర్ణముగ ననుకరింపఁజాలదు. అది యేకళకును సాధ్యము గాదు. వీనిలో చిత్రలేఖనము, విగ్రహరచనయు నొకజాతికిఁ జేరును. అనుకరణమున లయ సామ్యలక్షణ మగుటఁబట్టి నాట్య గానకవిత్వము లొకజాతికిం జెంది యన్యోన్యాశ్రయముగలిగి యుండును. కవిత్వమందలి శబ్దము లేకపోయినచో గానము చిర స్థాయిత్వముగల యానందము నొసఁగఁజాలదు. కవిత్వము గానమందలి లయనాదములతో మేళగింపనిచో సుఖమునొసం గదు. ఇఁక నాట్యము గాన, కవిత్వముల సాయములేనిచో స్పష్టతఁగూర్చి యాకర్షింపదు. కాని లలితకళలన్నియు నాటక కళయందు కలిసి వర్తించి యాకళను సర్వాంగసుందరముగ నొనర్చుచున్నవి.

లలితకళలం దనుకరణము మూలమునెంత సమీపించిన వానియోగ్యతయంత పెరుఁగును. కాని సంపూర్ణముగ నే

వస్తువునైన ననుకరించుట యే కళకైనను సాధ్యముగాదని వెనుకఁ దెలిసికొంటిమి. మఱియు కళాకార్యమునకు సంపూర్ణా నుకరణ మనావశ్యకము. ఎందుకనఁగా కళయొక్కపని వస్తువును గుర్తించుటకుఁ గావలసిన ముఖ్యధర్మములను మనస్సునందుఁ బ్రతిబింబింపఁజేయుటయే, కాని దానిసూక్ష్మములైన వివిధో పాంగముల జ్ఞానము మన మెదడున కలికించుట కాదు. అను కరణము రెండు విధములు. మొదటిది బహిరంగానుకరణము. ఇందు వస్తువుల బాహ్యరూప మనుకరింపఁబడును. రెండవది యంతరంగానుకరణము. ఇందు పాత్రలభావము లనుకరింపఁ బడును. బహిరంగానుకరణముకంటె నంతరంగానుకరణము సేయుకళయే జనుల నెక్కువ యాకర్షించును. వస్తువులయొక్క యంతరంగమును జక్కఁగ భావనచేసి యనుకరింపఁగల్గిన శిల్పి గల్గెనేని మనము సాధారణముగ నావశ్యకములని తలఁచు బైటి యంగములుగూడఁ గొన్ని నిరర్థకము లనిపించును. అట్టి యంత రంగానుకరణము కష్టసాధ్యము.

కవిత్వము శబ్దసంజ్ఞల నుపయోగించినను బ్రదర్శింపఁ దలఁచిన వస్తువులస్వరూపమును సృష్టించి యానందముఁగల్గిం చును. వివిధప్రకారములైన మానవచర్యలను శీలమును ముఖ్యవస్తువుగా గ్రహించి ప్రదర్శింపఁగలుగుటచేత, నే యితర కళయు వస్తువిస్తృతిగల్గి మూలవస్తువు నింతసంతృప్తికరముగ ననుకరింపఁజాలమిచేతను కవిత్వము మిగిలినకళలకంటె శ్రేష్ఠమ య్యెను. ఉత్కృష్టకవితాసృష్టియైన నాటకమం దీమానవజీవి

తానుకరణము పరమావస్థను జేరును. అందుచేతనే సంస్కృతాలంకారికులు 'కావ్యేషు నాటకం రమ్య' మ్మనిరి.

ఆలంకారికులు కావ్యమును 'వాక్యం రసాత్మకం కావ్య' మ్మని నిర్వచించునపుడు రసాత్మకత్వము శబ్దమునకంటె నర్థమునకెక్కువప్రాధాన్యమని పండితు లందఱంగీకరింతురు. కాన రసాత్మకమైన యర్థములేకభావము కవిత్వమనఁబడును. ఆ భావమును వ్యక్తీకరించునది భాష. కాన కవిత్వమునకుఁ బ్రాతిపదిక భావమనుట సర్వసమ్మతము. తిక్కనకాలమున వర్ణింపఁబడిన మానవమానసికవ్యాపారములు ప్రతికాలపువారు దమస్వానుభవములకు సరిగానుండుటఁగ్రహించి యానందించుటచేత, నితర దేశకవులగు షేక్స్పియరు మొదలగువారి కావ్యములందలిభావముల మనముచదివి మనయనుభవములకుఁగూడ సమన్వయించుకొని యానందింపఁగలిగి యాయాభావములను, భాగములను మనభాషలోనికిఁ బరివర్తనము సేసికొనుచుండుటచేతను, మనదేశకవులైన కాళిదాసాదుల శాకుంతలాదినాటకముల విదేశీయులగు గేటీమొదలైనవారు చదివి యానందమున నోలలాడుటచేతను, వేషభాషాచారాభిరుచులు వివిధదేశకాలజాతిమతములఁబట్టి భిన్నములుగనుండినను, మానవమానసికప్రవృత్తులు సర్వదేశకాలములందు నొక్కవిధముగనే యుండుననుట నిశ్చయము. భాషభిన్నమైనను భావములువిశ్వజనీనములగుటచేతను, కవిత్వమూభావముల వ్యక్తీకరణమే యగుటచేతను, కవిత్వము విశ్వజనీనమని యొప్పుకొనవలసివచ్చుచున్నది. అందుచే కవిత్వనిర్వ

చనమును గవిత్వవిమర్శనపద్ధతులునుగూడ విశ్వజనీనాన్వయము గలవిగ నుండుట మేలు.

అరిస్టాటలు దన విమర్శనశాస్త్రమందు మూఁడుప్రధాన సూత్రములఁదెలిపినాఁడు. ఒకటి- యితరలలితకళలతోఁబాటు కవిత్వముయొక్క ముఖ్యకర్తవ్య మనుకరణముగాని యుపదేశముకాదు. రెండు- కవిత్వమనుకరింపఁ దగినవిషయము విశ్వజనీనమై యుండవలయునుగాని ప్రత్యేకవ్యక్తిగతము గాఁగూడదు. మూఁడు- కవిత్వోత్కృష్టతను బరీక్షించుప్రయోజనమేమన నది శాశ్వతానందమును సంఘమునకుఁగూర్పవలెఁగాని కవికిమాత్రముగలుగఁజేసినఁ జాలదు. కవిత్వము మానవప్రకృతిలో గాఢముగా నాటుకొనియున్న రెండు ముఖ్యధర్మములనుండి యుద్భవించినట్లు గనఁబడుచున్నది. మొదటిది యనుకరణాభిలాష; రెండవది ఛందోరూపమునవ్యక్తమగు శ్రుతిలయాభిలాష. ఇందుచేతనే క్రౌంచమిథునములో నొకదానిని బోయవాఁడు దెగనేయఁగ రెండవదాని వియోగదుఃఖమువలనఁగలిగిన వాల్మీకి శోకము ఛందోరూపమునవ్యక్తమై,

శ్లో॥ మా నిషాద ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమాః
యత్క్రౌంచమిథునా దేకమవధీః కామమోహితం ॥

అనుశ్లోక మాదికవిత్వ మయ్యెను.

పాశ్చాత్యదేశములలో కవిత్వమునకు ఛందమావశ్యకమా, కాదా, యనువిషయమునుగూర్చి యనేకవాదములు బయలుదేరినవి. కవిత్వమునకు ఛంద స్సలంకారప్రాయమే కాని హేతుభూతముగాకపోవుటచే నది యావశ్యకము గాదనికొంద

యును, ఛందస్సువినా కవిత్వముండఁజాలదని మఱికొందఱును వాదించిరి. సంస్కృతాలంకారికులు 'గద్యపద్యోభయమయం కావ్యం కావ్యవిదో విదుః' యని తెల్పి గద్యపద్యములరెండిటికిఁ గావ్యగౌరవమిచ్చుటచే భరతదేశమున నీవాదమున కవకాశము లేకపోయెను. కాని కవిత్వనామమాత్రమైనను లేని గణబద్ధరచనలును, రసవత్కవితగల వచనము లనేకముగ నుండుటచే ఛందము కవిత్వప్రత్యేకలక్షణము కాఁగలదా యనిప్రశ్న. కవిత్వతత్త్వము భావానుకరణమందు ముఖ్యముగా నుండుననుట సత్యమే. కాని యింతమాత్రమునఁ గవితాకళ సంతృప్తికరముగ నుండఁజాలదు. ముఖ్యధర్మమైన భావానుకరణము దగురచనయందుఁగూర్పఁబడినఁగాని కవిత్వకళ పరిణతిఁబొంది సమగ్రము గాఁజాలదు. సకలోత్కృష్టభావములును, రసావేశములును లయాన్వితమగు ఛందోబద్ధమైనభాషలో వెలువడుట సహజము. ఆభావమెంత గంభీరమైన యాభాషయు నంత నియమబద్ధమై వైలక్షణ్యము గలిగియుండును.

మఱియు ఛందస్సు గానమువలె భావావేశమును బ్రేరేచి శ్రోతలహృదయములందు సంచలనము గలిగించుటకు దోహదమగును. కవిత్వముఖ్యప్రయోజనమైన రసానందమును బొందించు శక్తి ఛందోరచనయందున్నది, కాని గద్యరచనయందు లేదు. కాన భావావేశము ఛందస్సును బ్రేరేచునట్లు ఛందస్సుగూడ భావావేశమును బ్రేరేపించును. అందుచే నీరెంటికి నవినాభావసంబంధమున్నదనుట స్పష్టము. కనుక రసావేశమే ప్రయోజనముగాఁ గల కవిత్వభావములకును ఛందస్సునకును గలసంబంధము యా

దృచ్ఛికముగాని, సాంకేతికముగాని, యాలంకారికముగాని కాక విశ్వజనీనమును తార్కికము నైయున్నది. కాబట్టి ఛందస్సు వినా కవిత్వభావము శరీరము లేని యాత్మవలెనుండును. రసభావము లేని ఛందోరచన యాత్మ లేని శరీరమువలె నగు. కాన సత్యమునకు కవిత్వకళ యీ రెంటియైక్యమును గోరును. క్వాచిత్కుగా దీనికపవాదములుగల రచనలున్నను గవిత్వమునకు ఛందస్సొక ప్రత్యేకావశ్యక లక్షణమనియే యెంచఁదగును.

అరిస్టాటిలు నాట్యసంగీతములందు లయయుత్కృష్టస్థాన మొసఁగుటయేకాక, కవిత్వమందుండియే యుద్భవించినదని చెప్పినను, కవిత్వోన్నత్యమును నిర్దేశించు తఱి దానిని గౌరవింపడు. కవిత్వానందమును నేత్రేంద్రియమునకంటె కర్ణేంద్రియమున ననుభవించి, దానికి గానముతో సంపర్కముఁగూర్చు గ్రీసుదేశీయునియం దిట్టి యభిప్రాయమును బొడగనుట విచిత్రమే, కాని యితఁడు ఛందస్సును కవిత్వమునుండి బహిష్కరింపఁడు.

కవిత్వముఖ్యకర్తవ్య మనుకరణమనుటచేఁ గవి మూలమునకున్న దున్నట్లుగా ఛాయాచిత్రమువలె నకలుసేయఁ జూచునని కాక, తన యింద్రియములకు గోచరించునట్లు దాని ననుకరించునని భావము. మఱియు నది ప్రతిప్రాకృతవ్యాపారము ననుకరింపదు. ప్రపంచమున నల్పములు, ననౌచిత్యములు, నశాశ్వతములైన కుత్సితవిషయము లనేకమున్నను గవిత్వము వాని జోలికిఁబోదు. అందుచేతనే యేమహాకవియు భోజనమజ్జనాది నీచక్రియలవర్ణింపఁడు. సంస్కృతాలంకారశాస్త్రమందుఁ గూడ

నట్టివానిఁ జూపఁగూడదను నిషేధముగలదు. కాన కవిత్వము మూలవస్తువునఁగల యాదృచ్ఛికములను, ప్రత్యేకములైన గుణములఁ బరిత్యజించి యందలి శాశ్వతములును, నిత్యసంబంధము గల ధర్మములనుమాత్రమే వెలార్చును. అదివ్యావహారిక ప్రయోజనములను, పాశవాభిలాషలను నిరాదరించును. కవిత్వ మితర లలిత కళలవలె విశ్వజనీనములగు నైతికలక్షణములుగల శీలము, క్షణికములైన రసావేశములు, హృదయ పూర్వకక్రియలుగల మానవజీవితము నింద్రియగోచరమగురీతి ననుకరించును. అందుచే భూసీమ, మృగవృక్షపక్ష్యాదులు ముఖ్యానుకరణ విషయములుగాక, మానవచర్యలకు రంగస్థలముగానుండును.

ఇట్టి యనుకరణము విశ్వజనీనమై యుండవలయును గాని ప్రత్యేకవ్యక్తిగతమై యుండరాదు. ప్రపంచమందలి సకలమానవుల మానసికవ్యాపారములు సర్వదేశకాలములం దేకముగ నుండునని పూర్వము దెలిసికొంటిమి. కవి యొకానొక ప్రత్యేక విషయమును బ్రపంచమునుండి గ్రహించి, ప్రతివ్యక్తియందు నస్ఫుటముగ వ్యక్తీకరింపఁబడిన దానియాదర్శరూపము ననుకరించును. ఇంద్రియగోచరమైన స్వరూపము కవి మనసునందు ముద్రితముగాఁగ, యథార్థప్రపంచమున నర్ధవ్యక్తమైన యీ యాదర్శమును సుష్టుగావ్యక్తీకరించి బహిర్గతము సేయఁబ్రయత్నించును. ఆ వస్తువునకు విశ్వజనీనతాముద్ర నొసఁగుటలో నాతని శిల్పనైపుణ్య మిమిడియుండును. ఒకవిషయమును గూర్చి ప్రపంచమందలి సకలమానవులకు నైక్యముగ నెట్టిభావము గల్గునో యది విశ్వజనీనము. నిర్దిష్టశీలముగల యొకపాత్ర యొకా

నొక పరిస్థితియందు తదవసరముఁబట్టి సంభావ్యధర్మానుగుణముగ నెట్లుమాట్లాడి ప్రవర్తించునో యది విశ్వజనీనమనఁబడును. నామగ్రహీతులైన పాత్రలుగల కవిత్వ మిట్టివిశ్వజనీనత్వమునే లక్ష్యముగాఁగలది. కవి మూలమందున్నదానిని కొంతచూచి, యుండవలసిన దానినికొంత భావించి, సంభావ్యమగుదానిని కొంత యూహించి, విశ్వజనీనముగ నుండు నట్లనుకరించును. ఇదే కళాధర్మము. సర్వజనులు విశ్వజనీనముగ ననుభవించి భావించు నొకదృశ్యము నెవఁడు చిత్రించునో వాఁడే నిపుణుఁడైన మహాశిల్పి. అనేకులు భావనసేయు గూఢతత్త్వమును వ్యక్తీకరించుశక్తి యతనికి మాత్రమే యుండును. కళయొక్క మూలమును బరిమితియు నేవో, ప్రకృతియొక్క విచిత్రరహస్యముల గ్రహించుట కెట్టిపద్ధతుల నవలంబింపవలెనో, పెడమార్గమున కాకర్షించుమనస్సు నరికట్టుటెట్లో యతనికి బాగుగఁదెలియును. అతఁడే కళయొక్క మూలమును సమగ్రముగ నెఱిఁగినవాఁడు. అద్యతనకాలమున నెలువడుచున్న భావకవిత్వమను పేరుగల ఖండకావ్యములావేశపూరితములయ్యు సర్వజనాదరపాత్రము గాకపోవుటకుఁ గారణ మందలి భావములు విశ్వజనీనములు గాకపోవుటయే. అందుఁగవులు దమసొంతగోడును జెప్పుకొనుచుఁ దమప్రత్యేకవ్యక్తియందుఁగల భావములనే వెలువరించిరి కాని, తమభావములకు నితరుల భావములతోఁ గలసంబంధమును విచారించి వానిని విశ్వజనీనముగఁ జేయఁజూడరైరి. కాన కవిభావములును, పాఠకుల భావములును వేఱైనవి. అందుచే జనులు వారిభావములతో సహృదయత్వము నెఱపి, వారికవిత్వమర్థము

సేసికొనఁ జాలరైరి. కవిత్వమున విశ్వజనీనత్వమునకుఁ గల స్థానమిది.

అరిస్టాటిలు కళాధర్మములను గళాస్థితిని దానిశక్తిప్రయోజనములనుండి గ్రహించెనుగాని సౌందర్యతత్త్వ విచారణనుండి గ్రహింపలేదు. అతఁడెక్కడను సౌందర్యవ్యక్తీకరణము కళయొక్క కర్తవ్యమని సూచింపనైనను లేదు. కళయొక్క ధర్మమును సక్రమముగా నెఱవేర్చుటయందే సౌందర్యముండునని యతఁడు దెల్పెను. కావున నతని కళాభిప్రాయము సౌందర్యమతమున కెంతమాత్రము సంబంధించియుండలేదు. కళాధర్మము సౌందర్యవ్యక్తీకరణ మనుమతము నవీనమైనది.

కవిత్వమనఁగ నొకకథయొక్క సంఘటనపరంపర నొకటి తరువాత నొకటి యెట్లు జరిగెనో యట్లు కాలక్రమముగ 'జాబితా' వలెఁ జెప్పుటకాదు. ఇది చరిత్రపని. భూతకార్యముల నున్నవున్నట్లు సెప్పుటకాక, సంభావ్యావశ్యక ధర్మముల ననుసరించి యేదిజరుగసాధ్యమో, దానినిజెప్పుటయే కవిపని. చరిత్రకారుఁడును గవియు గద్యపద్యములందు రచించుటచే భిన్నులుగారు. చి. వీరభద్రరావుగారి యాంధ్రులచరిత్రను పద్యరూపముగ రచించినను నదిఛందోబద్ధమైనచరిత్ర యనిపించుకొనునే కాని కావ్య మనిపించుకొనదు. వానియథార్థభేద మేమనఁగ నొకటి జరిగినదానిని, మఱియొకటి జరుగనగుదానిని జెప్పును. కవిత్వమందు చరిత్రయందుకంటె నెక్కువయుదాత్త వస్తువుండును. అది విశ్వజనీనవిషయములఁ గూర్చిచెప్పునుగాని చరిత్రవలెఁబ్రత్యేక విషయములఁగూర్చి చెప్పదు. చరిత్ర సంఘటనల

మీఁద నాధారపడి వానితోడనే ముఖ్యముగా సంబంధించి యుండును. కవిత్వమాసంఘటనల తాత్త్వికసత్యములుగా మార్చును. సంఘటనలనట్లు మార్చి చెప్పకపోయినచో కవిత్వమున గౌరవము లేదు. మార్చి చెప్పినచో చరిత్రకు గౌరవము లేదు. చరిత్రయందుకంటెఁ గవిత్వమునఁ గార్యముల కవినాభావసంబంధమనివార్యము. చరిత్రయందుఁ గాలక్రమము ననుసరించి చెప్పఁబడిన సంఘటనలఁ గార్యక్రమముగ నుండును. ఒక్కొకసంఘటనకు మఱియొక సంఘటనకుఁగల సంబంధమును గార్యకారణరూపమునఁ గలిపి, యాసంఘటనలను విశ్వజనీనములైన సత్యములుగ నుండునట్లు కవిత్వము మార్చును. కథాసంవిధానమందు మాత్రమే కాక పాత్రల మనోవృత్తి వివరణమందుఁగూడ కవిత్వము ప్రాపంచిక వ్యవహారమందుఁగంటె నెక్కువ సహేతుకత్వమును బాటించును.

అంతర్నియమమే వివిధభాగములకైక్యతఁ గూర్చును గాన కావ్యాంతర్నిర్మాణమందు సంభావ్యావశ్యక ధర్మములు ముఖ్యముగా నుండవలెను. సంభావ్యత సంఘటనవిషయ సంఖ్యయొక్క సగటునుబట్టికాని, సామాన్యవ్యవహార విషయముల క్రోడీకరణమునుబట్టిగాని నిర్ధారణ సేయఁబడదు. వ్యావహారికధర్మములు కళ ననుశాసింపవు. కవిత్వమందలి యున్నత విషయసృష్టి వేఱొక గోళమున సంచరించును. నాటక, పురాణములందు జరుగు సంఘటనలు సాధారణజీవితమునకుఁ జెందినవి కావు. అందలి పాత్రలు సామాన్య స్త్రీపురుషులు గారు. వారిప్రవర్తనాసంభావ్యతను సామాన్య వ్యవహారమునుబట్టి పరి

గణింపరాదు. రాముఁడు, దుష్యంతుఁడు, నోథెల్లో, హామెలెట్టు మొదలగువారి భావములు, క్రియలు, నావేశములును నీచ మానవపద్ధతుల సంగ్రహరూపములుగావు. కాని సామాన్య మానవుఁ డాపాత్రలతో సానుభూతి నెఱపఁగల్గును. వారితోడి సహృదయత్వమువలన వాని ప్రకృతి యుదారమై యతని దృష్టి విశాలమగును. అట్టిపాత్రలు మనము నిత్యవ్యవహారమునఁ గాంచువారికంటె ననేకవిధముల శ్రేష్ఠులుగారా? వారిమనోవాక్కాయకర్మల సంభావ్యధర్మమును సామాన్యమానవులతోఁ బోల్చి పరిశీలింపము.

కవితాప్రపంచ మభూతకల్పనలఁ జేయునుగాని వాస్తవమును జెప్పదనియు, నందలిపాత్రలు పూర్వమెప్పుడును జీవించిన వారుగారనియు, నట్టివిషయములెక్కడ తటస్థించినవి కావనియు నొక పూర్వపక్షముగలదు. ఔను. అవి సత్యములుగావు, కాని సత్యాతీతములు. కవిత్వమునకు సంఘటనలతో సంబంధము లేదుగాని, యతీతమైనసంఘటనలతో సంబంధముండును. వాస్తవప్రపంచమం దభూతమైనవిషయముల నది ప్రదర్శించును, కాని వాని యాదర్శభావమైన 'యుండవలసిన' రూపములనిచ్చును. రామ, దుష్యంతాదిపాత్రలు సత్యాతీతులను భావమున నసత్య వ్యక్తులుగాని, ప్రకృతిధర్మములకును, బ్రకృతియాదర్శలక్షణములకు నవి భిన్నములు కావు. 'జరుగవచ్చు' నను ధర్మము 'జరిగె' ననుధర్మమును బహిష్కరింపదు. కొన్ని వాస్తవసంఘటనలందుఁ గవిత్వరచన కర్హమైన సంభావ్యావశ్యక ధర్మములుండును. కవి పురాణచరిత్రములను గులకరాళ్ల

గుట్టలనుండి కవితార్హసంఘటన లను మణుల నేఱి, వానినుండి యాదృచ్ఛికములు, నల్పములు ననౌచిత్యములు మొదలైన వానిని పరిత్యజించి, వ్యావహారిక సంపర్కములనుండి వేఱు చేయును. ఇట్లు పౌరాణికచారిత్రిక సంఘటనలను భావనాపూర్వక సత్యములుగ కవిత్వకళ మార్చును. కాన కవిత్వసత్యము సంఘటనసత్యముకంటె భిన్నము గాక తప్పదు. అనుభవాతీత విషయములు నిత్యసంఘటనలకంటె నెక్కువ సత్యముగ నుండును.

మఱియు కవికి కృత్రిమకల్పనలతోఁ జమత్కరించుట నైజగుణము. కల్పనాకళయం దతఁడు మంచి నేర్పరి. ప్రారంభమున నతఁడొక కృత్రిమపరిసరమును గల్పించుకొని స్వేచ్ఛగ నూహాప్రపంచమున విహరించి, మనలఁగూడఁ దనవెంటఁ గొని పోవును. అతఁడు కృత్రిమవ్యక్తుల కొందఱను, గొన్ని విచిత్ర సన్నివేశములను, భావనాతీతసాహసికములను సృష్టించును. వానినన్నింటిని స్పష్టమైన కథాకథనముచేతను, వివిధవిషయ వర్ణనలచేతను, విశేషించి భావములఁబోషించుటచేతను, ప్రత్యక్షముసేయ సర్వము యథార్థ మనిపింపఁజేయునంత సజీవమును విశ్వాసపాత్రమునై ప్రకాశించును. తత్సమయమునఁ బ్రారంభ కల్పనయొక్క యాథార్థ్యమునుగూర్చి విచారింపము. కవితా చమత్కార రచనవలన వ్యావహారిక జీవితమందలి యవిశ్వసనీయవిషయములు సంభావ్యములుగను, నసాధ్యవిషయములు సాధ్యములుగను గనఁబడుటయేకాక యవి ప్రకృతిసిద్ధముగాను నావశ్యకములుగాను గూడఁ బొడకట్టును. ఆంతరవిషయముల సక్రమముగాఁబోషించినచో బాహ్యప్రపంచధర్మముల నిరాద

రింపవచ్చును. ఇందు సంభావ్యావశ్యకధర్మముల ననుసరించి యేదిసాధ్యమో యది గ్రహింపఁబడును. సాధ్యమైన యసంభావ్య విషయముకంటె, నసాధ్యమైన సంభావ్యవిషయమున కెక్కువ ప్రాముఖ్యము నొసఁగుట కళకావశ్యకము. కవితాదృష్టిలో నసాధ్యవిషయముకంటె ననౌచిత్యపూర్వకమైన యసంభావ్యవిషయ మెక్కువదుష్టమైనది. ఈ విషయమునే క్షేమేంద్రుఁడు దన యౌచిత్యవిచారచర్చలో 'అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణ'మ్మని తెలిపెను. అసాధ్యవిషయములు కవితాచమత్కారమునకు వశ్యమై తమయసాధ్యత్వమును గోల్పోవును. అందు కార్యకారణభంగ ముండదు. కాని యనౌచిత్య పూర్వకమైన యసంభావ్యవిషయ మెట్టిభావనాచమత్కారమునకును వశ్యము గాదు. కాన నాయాసంఘటనల ముఖ్యభావమును గ్రహించి, వానికిఁ బరస్పరసంబంధమును గలిపి యౌచిత్యమునుగూర్చి భావనాసత్యములుగ మార్చుట కవికి ముఖ్యకర్తవ్యము. కవితా ప్రపంచమున ననౌచిత్యములతోఁబాటు యాదృచ్ఛికమున కెక్కడను స్థానములేదు. సంభావ్యావశ్యకధర్మములు యాదృచ్ఛికమును బహిష్కరించును.

కాన కవిత్వము యాదృచ్ఛితములతోడ, నల్పవిషయములతోడఁ గూడుకొనిన మానవజీవితచిత్రమునకు, వ్యావహారిక సత్యమునకుఁ బ్రతిబింబముమాత్రము గాదు. కవి సృష్టించు సంభావ్యప్రపంచము వ్యావహారికప్రపంచముకంటె నెక్కుడుసు లభగ్రాహ్యమైనది. మానవప్రవర్తనమును, సత్యసంఘటనములను గ్రహించుటకాటంకపఱచు ననౌచిత్యములఁదొలగించి కవి శాశ్వతగుణములనే ప్రదర్శించును. మూలవస్తువును సంస్కరిం

చుటలోఁ బ్రకృతినిమీఱిపోవచ్చును, గాని కవి దానికిభిన్నుఁడు మాత్రముగాడు; దాని యాచారధర్మములను వ్యతిరేకింపఁడు. మూలమును పునఃసృష్టి సేయునుగాని, యందలి యనౌచిత్యముల, యాదృచ్ఛికముల, నసంభావ్యములఁదప్పక పరిత్యజించును. కావ్యసత్యము వాస్తవపరిసరముల మీఱిపోవునుగాని, వాస్తవ ప్రపంచమును సహేతుకముగనొనర్చు నియమముల నెన్నడుమనః పూర్వకముగ తిరస్కరింపదు. ఈ విధముగ కళోపాసకుఁడు విష యముల నెట్లుండవలయునో యావిధముగ మూలముకంటె నుత్తమముగనుండునట్లు నిర్మించుటకుఁ బ్రయత్నించును. సామాన్య చిత్రకారుఁడు దనయెదుటనున్న బాహ్యాకారమందలి రేఖలన న్నింటిని ప్రదర్శింపఁగలఁడు, కాని దాని జీవమును, శీలమును మాత్రము ప్రదర్శింపలేఁడు. ఇది యుత్తమచిత్రకారునకు సాధ్యమగుపని. అతఁడు దన చిత్రమును జీవవంతముగఁ జేసి మూలముకంటె దివ్యముగను, సుందరముగను జేయును. కవియు నీపద్ధతినే యవలంబించి యాదర్శప్రాయముగ రచించును. ఇట్లుసేయుట చేఁ గవిత్వము కేవలము సహజత్వమునుగాక, యాదర్శప్రాయముగను, బవిత్రముగను జేయఁబడిన సహజత్వమును బ్రకటించును.

సుందరమైనవస్తు వంతర్భాగమున సక్రమమైనకూర్పు గల్గియుండుటే కాక సముచిత పరిమాణముగూడఁ గల్గియుండ వలెను. ఎందుకన నది చాలచిన్నదైనచో దాని సమగ్రత గనఁబడును గాని యవయవములు గనఁబడవు. చాలపెద్దదైనచో నవ యవములుగనఁబడును గాని సమగ్రత గోచరింపదు. కాన కవితాసృష్టి యైక్యతను బహుత్వమునుగూడఁ బ్రదర్శింపవలయును,

పిమ్మట నావిషయమునకుఁ గవి పరిసరముద్రనొసఁగును; లేని చో నావస్తువు మనయాచారములకు దూరమై మనచేగుర్తింపఁ బడదు. కవితాసృష్టియందు సముచితస్థానమున సక్రమముగా నమర్పఁబడిన వివిధభాగములలో దేనిని మార్చుటకుఁగాని పరిత్యజించుటకుఁగాని యవకాశముండదు. అట్లొనర్చుచో దాని యైక్యతచెడి బిగిసడలును. ఈవిధముగ కావ్యవస్తువు ముఖగర్భ నిర్వహణాది సంధులతోఁగూడి యుండును. అప్పుడు ప్రకృతి యాశించిన యాదర్శరూపము కవిసృష్టిగతరూపమూలమున సాక్షాత్కరించి శివము, సత్యము, సుందరమునై ప్రకాశించును. ఇట్టి యాదర్శప్రాయమైన విశ్వజనానుకరణమే కవిత్వకళాసృష్టి. అందుచేతనే కవి బ్రహ్మయనఁబడి విధాతతోఁబోటీకి నిలుచు సృష్టికర్తయయ్యెను.

ఈ రీతిగ కవిత్వము దనసృష్టికి విశ్వజనీనత్వమును గూర్చు ప్రయత్నమున చరిత్రకంటె నుదాత్తమును తాత్వికము నైన యుత్తమసత్యమును వెలార్చి, తద్రూపమున తత్త్వశాస్త్రమునకుఁ జేరువ యగుచున్నది. యోగియొక్క ధ్యానశక్తిఁబోలిన భావనాశక్తితో నింద్రియగోచరమగు శాశ్వతభావముల వ్యక్తీకరించుకవి యైహికవిషయములనుండి, సౌందర్యాధ్యాత్మికములైక్యమొందు నొకయున్నతశాంతిమయగోళమున కారోహించును. ఈ విషయమునే కార్లైలుపండితుఁడు 'కవిత్వము పరంజ్యోతి సమీపమునకుం గొనిపోయి దానిని క్షణకాల మాత్రము దర్శించు మహాభాగ్యముఁగలుగఁజేయు'నని తెలిపెను. సంస్కృతాలంకారికులుగూడ నీభావమున నేకీభవింతురు. వారు 'విగళితవేద్యాంతరత్వరూపా బ్రహ్మానందసహో

దరీ రసాభివ్యక్తిః' యనిరి. ఐనను కవిత్వశాస్త్రములు రెండు నేకము గాఁజాలవు.

కవిత్వశాస్త్రములు రెండును బ్రకృతిని పరిశోధించి సత్యమును వెలువరించుటకే ప్రయత్నించును, గాని భిన్నలక్షణములుగల సత్యమును భిన్నమార్గముల వ్యక్తీకరించును. శాస్త్రము సత్యసంఘటనమును, కవిత్వము సత్యభావమును దెల్పును. శాస్త్రము భౌతికప్రకృతియందలి యథార్థవస్తువులఁగూర్చి యున్నదున్నట్లు సెప్పును. శాస్త్రము విభజనమూలమునను, కవిత్వ మనుకరణమూలమునను దమపనుల సాధించును. శాస్త్రిజ్ఞుఁడు పదార్థముల రూపములు, గుణములు, నిర్మాణవిధము, సంబంధము మొదలైనవానిఁగూర్చి పరీక్షించి, వానిని వివిధజాతులుగా విభాగించి, యవి యేపరిణామధర్మము ననుసరించి యట్లుండుటకుఁగారణమయ్యెనో పరిశోధించి, కొన్నిప్రయోగములమూలమునఁ దన పూర్వాభిప్రాయమును పునఃపరీక్ష చేసి నిశ్చయించును. ఈ విధముగ శాస్త్రము ప్రకృతియొక్క భౌతికరూపమందలి యొక్కొక్కవస్తువును బరిశోధించి, వివిధ వస్తువుల నొక్క సాధారణధర్మముక్రిందికిఁ దెచ్చి, చివరకుఁ బ్రపంచమునఁజెదిరిన నానావస్తువులందంతర్వ్యాప్తమైనది యొక టే శక్తియని విశ్వమునకైక్యత నాపాదించును. ఈవిధమున శాస్త్రము ప్రత్యేకత్వమునందు విశ్వజనీనత్వముఁగనిపెట్టుటకుఁబ్రయత్నించును. ప్రత్యేకత్వముమూలమున విశ్వజనీనత్వమును వ్యక్తీకరించుట కవిత్వలక్ష్యము. ప్రకృతిని కవి రసమయదృష్టితోడను, శాస్త్రజ్ఞుఁడు పదార్థపరిజ్ఞానదృష్టితోడను జూచును. శాస్త్రము విజ్ఞానమును, కవిత్వ మానందమును గలుగచేయును. శాస్త్ర

మున కాధారము బుద్ధి; కవిత్వమునకాధారము స్వానుభూతి. శాస్త్రమునకుత్పత్తిస్థానము మెదడు, కవిత్వమునకుత్పత్తిస్థానము హృదయము. శాస్త్రముయొక్క రాజ్యము సత్యము; కవిత్వము యొక్క రాజ్యము సౌందర్యము. శాస్త్రము భౌతికసత్యమును, కవిత్వము నిగూఢసత్యమును దెల్పును. కొలనిలోని పూవును జూపి యొకసామాన్యమానవు నడిగిన నది 'పద్మ' మనిచెప్పును. శాస్త్రజ్ఞుఁడది యేజాతిపుష్పమో వివరించిచెప్పును. కవి దానినే 'సరోవర సుందరి' యని యనువదించును. ఇట్లనుటచే నాసుమముయొక్క సౌందర్యసౌకుమార్యము లవగతమగును. మఱి యొకకవి దానినే 'తేజోకుసుమ'మనివ్యక్తీకరించును. శాస్త్రజ్ఞుఁడాపుష్పమునే దళములు, కాడ, కర్ణిక మొదలైన యవయవవిభాగముసేసి, దానియుత్పత్తివృద్ధిక్షయములఁదెలుపును. ఈ విధమున శాస్త్రకవిత్వములు రెండును సత్యమునే వెలార్చును, గాని మనమాశించునది శాస్త్రజ్ఞునిచేతియందు విభజింపఁబడిన పుష్పముకాదు. పద్మముయొక్క ఱేకులుత్తరింపఁబడుటఁజూచి నచో కవి విలపించును. అట్లుసేయుటకాతనిచేతులాడవు. కవికే కాదు; మనహృదయములుగూడ నట్టిచర్యలకు సమ్మతింపవు. కాన మనకు కవిత్వసత్యమునకు సన్నిహిత సంబంధము ఎక్కువ; శాస్త్రసత్యము దూరము. శాస్త్రము వస్తువుల తత్త్వము, నుత్పత్తి, జాతి, చరిత్రమొదలైనవానితోఁ గూడుకొనిన సక్రమహేతుపూర్వకవ్యాఖ్యానము సేయును. ఇంతే, శాస్త్రజ్ఞుని ప్రజ్ఞయు దృష్టియు దీనిని దాటిపోలేవు. ఇట్టి విజ్ఞానముగల్గిన మీఁద మనకుఁబ్రకృతికిఁగల సంబంధ మెట్టిదో శాస్త్రమెంత మాత్రము దెలుపఁజాలదు. ప్రపంచమందు సామాన్యముగా

మానవులందఱకుఁ బ్రకృతియందలి వస్తువుల శాస్త్రవిషయిక జ్ఞానమం దభిరుచియు నాదరణమును బహుస్వల్పము, కాని ప్రకృతికి మానవునకుఁగల సంబంధము ననుభవపూర్వకముగ వారు గ్రహింప నెంతురు. శాస్త్ర మీ యర్థమునఁ బ్రయోజనకారి కాదు. అందుకొఱకు కవిత్వము నుపాసింపవలసినదే.

కవిత్వము ప్రకృతికి మనకుఁగల సంబంధమును, బ్రకృతిని మనముసూచురీతిని, మనభావనావేశములపరమున, మనభావానుభవములకుఁ దాకునట్లు మానవజీవితమును వ్యాఖ్యానప్రాయముగ ననువదించును. ఇట్టిరచనగల కవిత్వము మానవుల భావావేశముల నుద్భోదించుశక్తి గల్గియున్నది. ఈ శక్తియే దీని విశిష్టలక్షణము. ప్రకృతియొక్క రసావిష్టభాగములందే యుద్భవించి యాదిక్కునుండియే కవిత్వము వ్యాఖ్యానముసేయుచు మనల నుద్రిక్తులఁజేయును. కవిత్వము ప్రకృతియందలి సౌందర్య రహస్యముల వెలార్చును. ఇవి ప్రపంచమందంతటను వ్యాపించి నిత్యము ప్రదర్శింపఁబడియున్నవి. అందఱు చూడవచ్చును. మనముకూడఁ బ్రకృతిలో నొకభాగమగుటచే మనలోఁగూడ నానాసౌందర్యరహస్యము లున్నవి. కనుక నాగుణముల మూలము ననే ప్రకృతియందలి సౌందర్యరహస్యముల గుర్తింప మనకవకాశము గలుగుచున్నది. ప్రతిమానవుని హృదయమునందొక రసమయకోశమున్నది. కాని యనేకులం దది నిత్యవ్యవహారమందలి యనేకేతరాభిరుచులవలన నణచివేయఁబడుచుండుటచే క్షీణించి క్రమముగా మాటుపడుచున్నది. అందుచే బహుస్వల్పసంఖ్యాకులు దప్ప మిగిలినవా రందఱు ఆ సౌందర్యరహస్యముల నల్పవిషయములుగ నెంచి నిరసనభావముతోఁ జూతురు.

కాన నదియందఱకుఁ గనఁబడుట లేదు. చూచినదికూడ వెంటనే వారు మఱచిపోవుదురు. ఇందుచే మానవులనేకులా సౌందర్య రహస్యముల నేత్రములుండియుఁ జూడలేకుందురు; వీనులుండియు వినఁజాలరు; హృదయముండియు భావింపలేరు. కాని కవికిఁ బ్రకృతియందిట్టి యుపేక్షాభావముండదు. అతఁడు ప్రకృతి భౌతికస్వరూపమునడుగున దాగియున్న పవిత్రమైన దివ్యరహస్యమును దనసూక్ష్మదృష్టితోఁ జూడఁ బ్రయత్నించును. ఇట్టిశక్తి యతనికిఁ బ్రత్యేకముగ దైవముచేఁ బ్రసాదింపఁబడును. కొన్ని రసావిష్టసమయములందుఁ బ్రకృతి దనగుణముల విశేషశక్తితో బహుస్పష్టముగఁ గనఁబఱచును. అప్పుడు మనహృదయములు సూర్యోదయమునకుఁ బద్మములు వికసించునట్లు వికసించి, మేఘోదయమున నృత్యమాడు నెమిలివలెఁ దనువు పులకరింప, మనము తన్మయమును బ్రహ్మానందమును బొందుదుము. అంతవఱకే మనబులపాటము. ఆ యానందమును మాటలతో వ్యక్తీకరింపలేక కాళ్లుసేతుల నటునిటు త్రిప్పుదుము. మాట పెనఁగి రాదు. బలవంతముగా మాట్లాడఁ బ్రయత్నించినచో నత్తి వచ్చును. ఇదిమనస్థితి. కవిస్థితి వేఱు: ప్రకృతియిచ్చిన యాయపురూపావకాశమును కవి గౌరవాదరణలతో గ్రహించి యానందాశ్చర్యములతోఁ గూడిన యొక యావేశానుభవముచేఁ దన్మయమును బొంది, చంద్రుని గాంచిన సముద్రమువలె పొంగును. ఇది వానిలోనున్న తమోగుణమువలన నుద్భవించును. ఇట్టియావేశము పాలుపొంగినట్లు కవిహృదయమునఁ బొంగిననేగాని కవిత్వము పరమావధి నొందఁజాలదు. ఆయుద్రిక్తభావము కంఠగతమై పొర్లఁజూచును. వెంటనే యాభావమును కవి వ్యక్తీక

రింపఁజూచినచో నది సంస్కారశూన్యమై యుండును. కాన సత్కవి దనయుద్రేకమును గొంచెమాపుకొని, దైవప్రసాదమగు సూక్ష్మదృష్టివలనఁ బ్రకృతిసౌందర్య రహస్యముల స్పష్టముగఁ బొడఁగాంచి యవగతము చేసికొనును. పరేంగితజ్ఞానముగల సూక్ష్మదృష్టి కవికి ఋషికివలెఁ దనయందుఁగల సత్వగుణము వలనఁ గలుగును. అందుచేతనే 'నానృషిః కవిః' 'నానృషిఃకురుతే కావ్య'మ్మనిరి. పిమ్మట తనభావనాబలముచే నతఁడు దానినను కరించుచు వ్యాఖ్యానప్రాయముగ వ్యక్తీకరించును. ఆ భావముల వ్యక్తీకరించుటకై కవికి సృష్టించుశక్తి యుండవలయును. స్రష్టృ శక్తి చేతనే యతఁడు కవిబ్రహ్మ యనఁబడుచున్నాఁడు. కవి కిట్టి సృష్టిసమయమున బ్రహ్మకువలె రజోగుణముండును. సృష్టి రజోగుణమువలననే సాధ్యము. అట్టి రజోగుణమువలననే కవి బ్రహ్మయగుచున్నాఁడు. ఈ విధముగ కవి మనకుఁ బ్రకృతికి నడుమ నిలిచి, మనకనులఁదెఱచి, మనచిత్తముల నుద్బోధించి, మనల నా ప్రకృతి సౌందర్యరహస్యముల కభిముఖులఁజేసి, మనము చూడలేని వస్తువుల మనభావనతోఁజూచునట్లు, మనకు నచ్చునట్లనువదించును. ప్రతిమానవునియందు నాప్రకృతి లక్షణములును, రసమయకోశమును గొంతగానైన నుండును, గాన మనముసమ్మతించి కవి పొందిన యావేశానందములనే పొందుదుము. ఈ విధముగ మనముగూడ ప్రకృతిసౌందర్యాను భవమునందు పాల్గొనునట్లు కవి సేయుచున్నాఁడు. ఇది కవిత్వశక్తి. ఇట్టి కవిత్వము లేనియెడల మనము ప్రకృతిసౌందర్య రహస్యములనెఱుఁగని యజ్ఞుల మగుదుము. కవిత్వము పరిణతమనస్కులకు సంస్కారము గలుగఁజేసి ప్రకృతి నభినందించు

శక్తి నొసఁగుచున్నది. ఇది విశ్వజనీనమైన సత్యమునకుఁ బ్రియమును బ్రత్యక్షమునైన స్వరూపము నిచ్చును. ఇందలి విశ్వజనీనత్వము నిరాకారమైన భావము గాక సజీవప్రక్రియగల యాకారము గలది. కవిత్వమందుగల యిట్టి యావేశ ప్రేరణ శక్తి శాస్త్రమందుఁగాని చరిత్రయందుఁగాని లేదు.

ఇట్టిశక్తిగల కవిత్వముయొక్క ప్రయోజనము వేదాంత జ్ఞానసాధనమనియు, కవులు నీతిబోధకులనియుఁ బ్రాచీనగ్రీసు దేశీయుల యభిప్రాయము. సంస్కృతాలంకారికులుగూడఁ గొంద ఱిట్లేతలంచిరి. భామహుఁడు,

శ్లో॥ ధర్మార్థకామమోక్షేషు వైలక్షణ్యం కళాసుచ ।
కరోతికీర్తిం ప్రీతించ సాధుకావ్యనిషేవణం ॥

అని పురుషార్థసాధకతఁ దెల్పెను. మమ్మటుఁడు వీనితోఁబాటనేక యితరప్రయోజనముల "కావ్యం యశసేఽర్థకృతే, వ్యవహారవిదే, శివేతరక్షతయే, సద్యఃఫలనిర్వృతయే, కాంతాసమ్మితతయోపదేశయుజే" యని చదివెను. మోక్షమార్గమునకును వేదాంతజ్ఞానమునకును శ్రుతిస్మృత్యాదులుండఁగఁ గావ్యమునభ్యసింపనేల? యనుయాక్షేపణ రాగా వేదాదులు పరిణత బుద్ధులకును, కావ్యములు సుకుమారబుద్ధులకుఁ జతుర్వర్గఫల ప్రాప్తి నొసఁగునని సమాధానమొసఁగఁబడినది. ఈ విషయమునే విద్యానాథుఁ డింకొకవిధముగఁ జెప్పినాఁడు.

శ్లో॥ యద్వేదాత్ప్రభుసమ్మితా దధిగతం శబ్దప్రధానాచ్చిరం।
యచ్చార్థప్రవణా త్పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్ ।

కాంతాసమ్మితయా యయా సరసతామాసాద్య కావ్యశ్రియా।
కర్తవ్యేకుతుకీబుధో విరచిత స్తస్యై స్పృహాం కుర్మహే ॥

కాని కవిత్వము లలితకళలలో నొకటగుటచే దానిప్రయోజనమునుగూడ కళాతత్త్వము ననుసరించియే గ్రహించుట యుక్తము. ప్రతికళాకార్యము మానవుల జ్ఞానేంద్రియముల నాకర్షించి భావనావేశమును ప్రేరేచును. ఈ రసావేశమే యానందమనఁబడును. కళాకార్యమెంతయుత్కృష్టమైన నది ప్రేరేచు నావేశ మంత గాఢముగ నుండును. కాన దానిప్రేరణశక్తిపై కళాకార్యముయొక్క యుత్కృష్టత యాధారపడియుండుననుట నిశ్చయము. రసావేశము మానవప్రకృతియందు నాటుకొని యుండి కళాకార్యదర్శనమువలన సాకారతఁదాల్చును. కాన కళాప్రయోజనమైన రసావేశము యాదృచ్ఛికమై వ్యక్త్యభిరుచి మీఁద నాధారపడి యుండునదికాదు. కళోత్కృష్టవిషయపరిగణనమున తచ్ఛాస్త్రపండితుని యభిప్రాయముకంటె కళాదృష్టిగల రసజ్ఞునియభిప్రాయమే యెక్కువ ప్రామాణికముగా నెంచఁబడును. ఇందుచేఁ గళాప్రయోజన మానందదాయకత్వ మనుట తేటతెల్లము. కాన నితర లలితకళలవలె కవిత్వప్రయోజనము గూడ నానందమే యగును. కనుకనే యాలంకారికు లితర ప్రయోజనములకంటె నానందమునకే యెక్కువ ప్రాముఖ్యత నిచ్చిరి. 'సకలప్రయోజన మౌళిభూతం సమనంతరమేవ, రసాస్వాదనసముద్భూతం, విగళితవేద్యాంతర మానందమ్.'

కాని కావ్యరసానుభవానందము సర్వత్ర యేకముగ నుండక కొన్నిచోట్ల నధికముగను, మఱికొన్నిచోట్ల నల్పముగ నుండును. రసానుభవమున హృదయమునకుఁ గొన్నియవస్థలు గలవు. అందు మొదటిది, స్పందము లేక చలనము; రెండవది, విస్తృతి; మూఁడవది, ద్రవీభావము. సూర్యకిరణస్పర్శచే కమల కోరకము చలించి, వికసించి, మకరందము కురియునట్లే, కవిత్వా నుభవమున భావకులహృదయము లీ యవస్థాత్రయమును బొందును. శబ్దచిత్రమువలన హృదయచలనమును, నర్థచిత్రమువలన హృదయము విప్పారుటయు మాత్రముగల్గును. ఇవి తక్కువజాతి కవిత్వములు. ఇఁక భావనాగమ్యమై వస్తుసాక్షాత్కారము సేయు కవిత్వము హృదయమును ద్రవీభూతము సేయును. కాన కావ్యో త్కృష్టత నదికూర్చు నానందావస్థనుబట్టి నిశ్చయింపవచ్చును. లలితకళ లిట్టియానందమును గూర్చునవనియే ప్లేటో వానిని గౌర వింపలేదు. ఎందుకన నతనిదృష్టిలో నానందము ధర్మదూరము. కాని యరిస్టాటి లిట్లు దలఁచలేదు. కవిత్వమున నానందమునకు ముఖ్యస్థానమిచ్చిన గ్రీసు దేశీయులలో నతఁడే ప్రథముఁడు.

కవిత్వావేశపరవశుఁడైన కవియు, ధ్యానమగ్నుఁడైన యోగియు పరంజ్యోతిదర్శనమువలన నొక్కవిధమైన యానందమునే యనుభవించినను, యోగీశ్వరుఁడు బ్రహ్మానందమును దానే యనుభవించును గాని యితరుల కేమాత్రము గూర్పఁజాలఁడు. కవిప్రకృతి వేఱు. కవిత్వరసానందము శ్రోతలకుమాత్ర ముద్దేశింపఁబడినది కాని కవికొఱకు కాదు. ఒకవేళ కవిగూడ నా కావ్యానందమున పాల్గొనినచో కవి దానిని శ్రోతగా ననుభవించును గాని కర్తగా కాదు. అందు

చేతనే తిక్కన భారతము 'నాంధ్రావళి మోదమొంద' రచింతు నని తెల్పినాడు.

కవిత్వము యొక్క ముఖ్యప్రయోజన మానందమైనను నది ధర్మప్రతిపాదకమై యుండవలయునా, లేదా యనున దొక వివాదాంశము. కవిత్వమందుఁ గళాధర్మమున్నఁజాలు; నీతిబోధ యనవసరమని కొందఱిమతము. మఱికొందఱు కావ్యమున నీతిబోధ లేనిచో కావ్యగౌరవము దక్కదని తలఁచిరి. కవిత్వమున నీతిబోధ లేనియెడల కావ్యగౌరవమునకు భంగము రాదు; కాని దాని కౌన్నత్య ముండదు. కావ్యౌన్నత్యము కథావస్తువునందు, భావనాశక్తియందు, నైతికదృష్టి ప్రభావమునందిమిడి యుండును. కాన కావ్యమున తత్త్వబోధయుండుట మేలు. అట్లని కావ్యమున నీతిని ప్రయత్నపూర్వకముగ నిముడ్చరాదు. అట్లయినచో కవిత్వ మానందమిచ్చు ధర్మమును గోల్పోయి నీతిబోధ సేయు ధర్మమును గ్రహించును. ఒకవేళ కావ్యమున ధర్మబోధ లేకపోయినను బాధలేదు, గాని యధర్మబోధమాత్రముండరాదు. భారతీయులదృష్టిలో కావ్యమున ధర్మబోధ లేనిచో నధర్మబోధ యున్నట్లే పరిగణింపఁబడును. వారికి కావ్యమున తటస్థభావము లేదు. అధర్మబోధ సేయు కావ్యములిచ్చు నానందమాభాసమాత్రమే కాని యథార్థానందముగాదని విశ్వనాథుఁ 'డనౌచిత్య ప్రకృతత్వే ఆభాసో రసభావయోః' యని దెలిపినాడు. మఱియు ప్రపంచమునకు ధర్మానుశాసన విషయమున కవు లభిషిక్తులుగాని ప్రభువుల వంటివారు, గాన లోకకళ్యాణార్థముగూడ కావ్యమున ధర్మబోధ యుండవలెను. ఐనను నీతి కావ్యమున వ్యంగ్యముగ సూచింపఁబడవలెనే కాని ప్రత్యక్షముగ బోధింపరాదు. అందుచేతనే కావ్యము

లు కాంతాసమ్మితములనఁబడెను. వాస్తవమునకు కవిత్వమునకు నీతిబోధకు నెట్టి ప్రత్యక్షశత్రుభావములేదు. రమణీయతాభ్రంశము గలుగకుండ, తత్త్వోపదేశమును రసభావరూపమున మార్చి కావ్యమున నిముడ్చవచ్చును. ఇట్లు రచించుట కవిశక్తియందుండును గాని కావ్యవస్తువు నందుండదు. రసానందమునుగూర్చి తత్త్వోపదేశముఁజేయు కవిత్వము త్తమోత్తమమగును.

కవిత్వమందు రసావేశము, భావన, జ్ఞానము, రచనయను నాల్గుముఖ్యధర్మములుండును. వీనిలో రసావేశము ప్రధానము. లోకమున నొకదృశ్యమును జూచుటవలనఁ గల్గిన రసభావమును కవి కవిత్వమున రచించి పాఠకునికిఁగూడఁ గల్గునట్లు సేయును. కవియందున్న రసావేశము రచనాలోపమువలన కవిత్వమున సంక్రమింపఁజేయలేమి పాఠకుని నానందపెట్టక పోవచ్చును, గాని పాఠకుని నానందపెట్టిన కవిత్వరసభావము కవియందుండకుండట సాధ్యముగాదు. కాన రసావేశమును బాఠకునియందే కనుగొనవలయును. ఈ రసావేశ ముచితమైనదియు, హృదయచలనముఁ గూర్చు శక్తిగలదియు, స్థిరభావముగలదియు, వివిధభావముల కాశ్రయభూతమైనదియు, పవిత్రమైనదియుఁ గావలయును. మఱియు కవిపొందిన యీ భావావేశమును పాఠకునకుఁగల్గించుటకు భావనాశక్తి యొక్క సాయము గావలసియుండును. దీనిమూలముననే తానుచూచినదాని రూపమును కవి పాఠకునికిఁజూపింపఁగల్గును. కవిత్వమునకీరెండును ప్రాణమువంటివి. ప్రతిభావంతుని కవిత్వమున నివి తప్పకగన్పట్టును. దీని తర్వాత కావ్యమున నౌచిత్యముగూర్చుటకును, జగద్రహస్య

మును గ్రహించుటకును విజ్ఞానముపయోగపడును ఇదిలేక మిగిలినశక్తులున్న కవిత్వము నిస్సారమగును. రసావేశభావనాశక్తులులేక విజ్ఞానమొకటిమాత్రమున్న కవిత్వము నిష్ప్రయోజనమగును. వీనితరువాత రచన కవిత్వమునకు శరీరమువంటిది. దీనియందు మాధుర్య ప్రసన్నతాగుణములు ముఖ్యములు. మాధుర్యగుణమువలన కవిత్వము వీనులకింపుగనుండి రసభావాదులు పోషింపఁబడును. ప్రసన్నతాగుణమువలనఁ దా ననుభవించిన దృశ్యానుభవములను కవి పాఠకునకు సులభముగాఁ గల్గింపఁగల్గును. కవిత్వమున మిగిలిన ధర్మములుండినను మాధుర్యప్రసన్నతాగుణములులేనిచో లోపముండును, గాని యితరధర్మములులేక యిదే ప్రధానముగాఁ బోషింపఁబడినచో నది హీనజాతికిం జెందిన కావ్య మగును. ఇది ప్రాణహీనమైన సుందరమైన శరీరముఁబోలి యుండును. ఈ విధముగ నీ నాల్గుధర్మములు కవిత్వమున నుపయోగపడును. ఈ ధర్మములన్నియు కలిసి యుండు కవిత్వ ముత్కృష్టమై యపురూపముగానుండును. సామాన్యకావ్యములలో కవి కభిమానముగల యేయొకధర్మమో యుండి యాకావ్యమునకు విశిష్టతఁగూర్చును. కాన నాధర్మము దానియందు గుర్తింపఁబడి, దానిఘనతకుఁ గల కారణము నిర్ణయింపఁబడును.

ఇట్టికవిత్వకళను సృష్టించు కవి యెట్టిలక్షణములు గలిగి యుండునని విచారణ. జీవిత వ్యక్తీకరణమే కళ. శాశ్వతజీవిత రహస్యగ్రహణమునకై వినియోగించు గడియలందే మనము యథార్థమునకు జీవించునది. అవే మన బహుజాగ్రదావస్థఁ దెలుపు చిహ్నములు. అనిమేషస్థితిఁదాల్చినంత మాత్రమున

మనము మేల్కొనియున్నా మనికాదు. పక్షుల కలకలారవము నకుఁ బ్రతిధ్వనింపని మనసును; లతాంతమందస్మితమున కానందమున చిందులిడని డెందమును, మిణుకుమిణుకుమను తారలందుఁ దన ప్రతిబింబమును గాంచి, యంబుధితరంగడోలల నువ్విళ్లూరని యాత్మయు జీవితవ్యక్తీకరణమున కర్హములు గాఁజాలవు. వాస్తవార్థమందు జీవించువారి నేత్రములందు శాశ్వతతేజస్సును, నావేశములందు సకలప్రపంచమునఁ గలవిలాపమునకు సానుభూతియు, నాత్మలందు బ్రహ్మానందమునుండును. తుషారావృతపర్వత శృంగములతో సహవాసమును, శిశిరకాలగళితశుష్కపత్రములతో సహృదయత్వమును వారు నెఱపుదురు, ఏతాదృశులుమాత్రమే కళను సృష్టింపఁగలరు.

కవిత్వము భావావేశముల మూలమున జీవితమును వ్యక్తీకరించును గాన, సత్కవికి విషయాంతర్భాగముల గ్రహించుటకు సూక్ష్మదృష్టి యుండవలయును. అతీంద్రియదృష్టి గలవానికి స్థూలదృష్టికి గోచరింపని యనేకవిషయములు గనఁబడును. దీనిమూలముననే కవి ప్రకృతిరహస్యముల గ్రహింపగల్గి, కవిత్వవస్తువునం దేది ముఖ్యమై వెలువరింపఁదగినదో, యేది యనవసరమై లోపింపఁదగినదో, దాని యాదిమధ్యాంతములేవో గుర్తింపఁగలుగును. కార్లైలు కవిలక్షణములలో దీనికే ప్రాధాన్యమిచ్చి, యతీంద్రియదృష్టి లేనిచో గణబద్ధరచనచేసి కవులను పేరుపెట్టుకొనిన లాభము లేదనియు, నదిగల్గినచో వచనమందు వ్రాసినను కావ్యప్రయోజనము సిద్ధించుననియు, భావన విజ్ఞానము మొదలైనవన్నియు దీనియందే యిమిడి యుండుననియుఁ దెల్పెను. ఈలక్షణము కవియందు సహజముగానుండును గాని,

సంస్కారముచేతను, నభ్యాసవశమునను రాను. దీని నేయాలం కారికులు ప్రతిభ, శక్తి, ప్రజ్ఞ యనునామములతో వ్యవహరించి దానిని, 'ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా' యని భట్టతౌతుఁడును, 'ప్రతిభా అపూర్వవస్తునిర్మాణక్షమా ప్రజ్ఞా' యని యభినవగుప్తుఁడును, 'కావ్యఘటనానుకూలశబ్దోపస్థితిః ప్రతిభా' యని జగన్నాథుఁడును నిర్వచించిరి. సత్కవికి ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసము లను మూఁడు ప్రధానగుణము లుండును. వీనినే దండి దనకావ్యాదర్శములో,

శ్లో॥ నైసర్గికీ చ ప్రతిభా, శ్రుతం చ బహునిర్మలం।
అమందాభియోగోఽస్యాః కారణంకావ్యసంపదః॥

అనియు; మమ్మటుఁడు కావ్యప్రకాశిక యందు,

శ్లో॥ శక్తిర్నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్ ।
కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతి హేతుస్తదుద్భవే॥

యనియుఁ దెలిపిరి. కాని యీ గుణములన్నియు కాళిదాసువంటి యేమహాకవికోతప్ప యొకటికిఁ యుండవు. ఇతరులందు వీనిలో నేయొక్కొక్కగుణమో యుండును; కాన వారికావ్యములందా లక్షణములు ప్రతిబింబించి, తదనుగుణమైన యర్హత నవి గణించును.

కవిత్వము లలితకళలలో నొకటిగాన, ప్రతికళకుఁ బ్రతిభ యావశ్యకముగాన కవిత్వమున ముఖ్యముగా ప్రతిభాస్ఫురణ ముండవలయును అది లేనిదే యెవఁడును కవిత్వకళను సృష్టింపఁజాలఁడు అపరిపూర్ణుఁడగు కవియొక్క కావ్యమున నశక్తికృతదోషముగాని, యవ్యుత్పత్తికృతదోషముగాని కనిపించును.

శక్తిపూర్ణముగా నున్నచో వ్యుత్పత్తిలోపమును గప్పివేయఁ గలదు, కాని పరిపూర్ణవ్యుత్పత్తి యున్నను ప్రతిభాలోపమును గప్పిపుచ్చఁజాలదు. ఈ విషయమునే యానందవర్ధనుఁడు,

శ్లో॥ అవ్యుత్పత్తికృతో దోషః శక్త్యా సంవ్రియతే కవేః।
యస్త్వశక్తికృతః తస్య ఝడిత్యేవావభాసతే॥

అందుచేతనే 'ప్రతిభావ్యుత్పత్త్యోః ప్రతిభా గరీయసి' యనఁబడెను. కావ్యహేతువులలో ప్రతిభ కింతప్రాముఖ్యత యున్నచో కవికాలక్షణ మొక్కటిమాత్ర మున్నచాలదా, వ్యుత్పత్త్యాదులేల యని ప్రశ్న. కవిత్వమునకు కళాస్థితియొక్కటే ప్రయోజనమైనచో నట్లే యగును గాని, సత్కావ్యము పురుషార్థసాధకము గూడ నగుటచేఁ గవియందు వ్యుత్పత్తిజ్ఞానముగూడ నావశ్యకమే. కావున కవిత్వమునకాదిహేతువు ప్రతిభయు, వ్యుత్పత్త్యభ్యాసములు దానికి సంస్కారములు నగును. ఈ విషయమునే వాగ్భటుఁడు,

శ్లో॥ ప్రతిభైవ చ కవీనాం కావ్యకారణం।
వ్యుత్పత్త్యభ్యాసౌ తస్యా ఏవ సంస్కారకారకౌ॥

యని నుడివెను. మఱియు పరిణతచిత్తము, రసావేశము, ఋషిధర్మము, చిత్తస్థైర్యము, కాణ్టైలు వచించునాత్మశుద్ధి మొదలైనవికూడ నుండవలయును. కాని యథార్థమాలోచింప నివన్నియు ప్రతిభయం దిమిడియుండును.

---